నెం 9 వ కరపత్రము.

# 'విమర్శాదర్శ' విమర్శాదర్శము.

ఇది

కాకినాడయందలి

ఆంధ్రభాషాసంరక్షకసమాజమువారిచేఁ

బ్రకటింపఁబడినది.

మొదటికూర్పు 1000.



పిఠాపురము.

శ్రీవిద్వజ్జనమనోరంజనీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1915.

# 'విమర్శాదర్శ' విమర్శాదర్శము.



## ద్వితీయభాగము.



నాలుగుపుష్పములు గ్రామ్యశారదాపీఠమున వైచి మా మిత్రులగు మ.బుఱ్ఱా శేషగిరిరావుపంతులుగారు గ్రంథరచన కారంభించిరి. ఆపుష్పములు గమగమ పరిమళించుచున్నవి. ధర్మార్థకామమోక్షసంఖ్యఁగలయాపుష్పములే కృతిపద్యములు. ఈపుష్పసౌరభముకంటె మామిత్రులసుగుణసౌరభము హృద్యతరముగ నున్నది. వీరిమాతాపితృభక్తికై మేము మహానందమొందితిమి. ప్రత్యక్షభూలోకదేవత లగుతలిదండ్రుల సర్వదా పూజించి సేవించుపుత్త్రుఁడే పుణ్యాత్ముఁడు. ఈగ్రంథమును మామిత్రులు తమతండ్రిగారికిఁగృతి నొసఁగిరి. పితౄణమిట్టియనన్యసామాన్యరీతినిఁ దీర్చుకొనినవీరు ధన్యులు. వీరి తల్లిదండ్రులసద్గుణావళిచే నీపుష్పచయము మఱింత సురభిళమగుచున్నది. పుష్పములు గుణములకు స్వల్పపరిమళ మిచ్చుట యాచారముగ నున్నదికాని గుణములే పుష్పముల కధికసౌరభ మిచ్చుట యాచారము లేదు. అట్టివిలక్షణసన్నివేశ మిట నున్నది.

వీరితండ్రిగారు ‘లచ్చనమంత్రి’ గారు. వీరు విజయనగరపుఁ బూసపాటిమహారాజుగారి పోషణమున నుండువా రని తోఁచుచున్నది. వీరు శ్రుతిస్మృతిపురాణములపరిచయము కలవారనియుఁ, బుణ్యాచారిత్రము కలవారనియు, జ్యోతిషమర్మము లెఱిఁగినవా రనియు, సత్యఋషి యనియు మనకుఁ దెలియుచున్నది. వీరితల్లిగారు రామయాంబగారు. వీరు పతిపూజయు నతిథిపాలనము, సూర్యోపాసనము కలవా రనియు, సద్వ్రతము లాచరించువా రనియు, నభిమానధనలనియుఁ దెలియుచున్నది. సద్గుణమణిగణభూషణధురీణు లగునీదంపతులు వీరిపుత్త్రి లగు మామిత్త్రులకువలె మాకుఁగూడ వందనీయులు కావున మేము వారికి నమస్కరించి మావిమర్శనమున ద్వితీయభాగమునుఁ బ్రారంభింతుము.

‘Dedicatory’ అనునింగ్లీషుపద మేల? కృతిపద్యములనినఁ గూడదా? ఇంగ్లీషుమాట నిట వీరు వాడుటకుఁ గారణ మేదియో యూరయఁజాలకున్నాము. నరకృతు లిచ్చినమన యాంధ్రకవులు కృత్యర్పణమున నొక్కమర్యాద ననుసరించిరి. వారియిష్టదేవుని ముందుఁ దలఁచి యట్టిదేవుఁడు కృతిపతి కాయురారోగ్యముల నిచ్చును గాక యని మొదటిపద్యమున వ్రాసి తరువాత లక్ష్మీపార్వతీసరస్వతులను సభర్తృకముగా స్తుతించి పూర్వసంస్కృతాంధ్రకవులకు మ్రొక్కి కుకవినిందఁ జేసి విద్యాగురువునకు నమస్కార మర్పించి కృతిపతి సభాశాలను

వర్ణించి స్వకవితాస్తోత్రమును గృతిపతిచేతఁగొంతఁజేయించి కృతినిమ్మని యాతనిచే సబహుమానముగ నడిగించి కృతిపతి వంశావతార మభివర్ణించి యాతని కభ్యుదయపరంపరాభివృద్ధిగాఁ గృతి నర్పింతురు. కృతిపద్యము లని మొదట వ్రాసిన యెడల దీర్ఘము ననావశ్యకము నగునీమర్యాదను యథావిధిగఁ బాటింపవలసి వచ్చునేమోయని సందేహించి కాఁబోలు! మా మిత్రు లాంగ్లేయపద్ధతి ననుసరించి నాలుగుముక్కలలో నీకృతి ప్రశంసను దీర్పవలయునని యుద్దేశించి (Dedicatory) అని ముందు వ్రాసి రేమో! ‘కృతిపద్యము ల’ నిముందు వ్రాసిన నైనను వారీపూర్వమర్యాదను బాటింపకుండవచ్చును. గ్రంథకర్తయిష్ట మెటులో యటులే జరిగింపవచ్చును. నన్నుఁ గొనియాడితివి కావేమని నన్నయభట్టు శాసించునా? ఆతని యాంధ్రవ్యాకరణశాసనమునుఁ దృణప్రాయముగఁ దీసివైచిన మా మిత్రులకుఁ గృత్యర్పణమర్యాదను మీఱుటలో నింత సందేహ మేల యుండవలయును? సంధ్యావందనము సాఁగఁ దోలినబ్రాహ్మణునకు జలస్పర్శవేళ జన్నిదమును మార్పవలయునేమో యనుసందేహ మేల?

కృతిపద్యములలో మొదటిపద్యము నిదిగువను వ్రాయుచున్నాము.

ఉ. ఆదిని శైశవంబుననె యాంధ్రపురాణకథావినోదముల్
మోదముతోడ జోలలుగముచ్చటబాడుచు నిద్రపుచ్చుచున్

బోధ లెఱుంగ నాకథలజ్ఞానమె సువ్రితు జేయునంచునర్
గాదిలిపట్టి తచ్ఛ్రివణకౌతుకు జేసిననాదుతండ్రి క
ణ్వాదుల బోలుసత్యబుషి లచ్చనమంత్రిదలంచి చెప్పెదన్.

కృత్యాదిని 'ఆదిని' అనుశబ్దమును వీరు వ్రాయుట మిగుల సొగసుగ నున్నది తండ్రిగారే పరమదైవ మగుటచేఁ గాఁబోలు వీ రిట దైవధ్యానమును ప్రత్యేకముగఁ జేయ లేదు. పద్యరచననుండి యతిప్రాసముల నేపాఱఁదోలినపండితునితోఁ బ్రథమపద్యారంభమున శ్రీకార మేల యుంపకపోయితి రని పోరాడుదుమా? స్వరమును విసర్జించి వేదపఠన మొనర్చువిప్రునితో మొదట 'ఓం' అన లే దేమని తగవులాటయా? "ఆదిని" యనఁగ 'గ్రంథకర్తగారిజన్మాదిని' అని యర్థము. ఎల్లరకు జన్మాదిని శైశవమె. తిరుగ 'శైశవంబుననె' యని చెప్పుట కేమి కారణమో బోధపడదు. మనుజునిజన్మమున నప్పుడు తప్ప మఱియొకప్పుడు శైశవము కలుగునని వ్రాయుటకుఁ గలమాడ కున్నది. కాని యత్యంతవార్ధకావస్థకు ద్వితీయశైశవమని కొందఱుకవులు వర్ణించుట కలదు.

Last scene of all
That ends this strange eventful history
Is second childishness and mere oblivion
Sans teeth sans eyes sans taste sans everything.

చావునకుఁ బూర్వము సిద్ధించుశైశవ మంత్యశైశవ మనియుఁ బుట్టుకతరువాతఁ గలుగున దాదిశైశవ మనియు వీరిమనస్సున

నుంటచే నిట్లువ్రాసియుందురా! అట్లైన నాదిశైశవమని వ్రాయవలయును గాని నడుమ 'ని' అనునక్షర మెందులకు? కల్పాదిసంగతి యనియా! యుగాదిసంగతి యనియా! సృష్ట్యాది స్థితియనియా! ముప్పదియేండ్లకు లోపున జరిగిన మామిత్రులజనన విషయమై యింతశబ్ద ముపయోగించుట యెందులకు? 'ఆదిని' అనఁగా విద్యాసంస్కారగ్రహణార్హసమయమందని యర్థ మనియు మామిత్రులకది శైశవమందే కలిగెననియు మాలో నొకరు చెప్పిరికాని యది క్లిష్టముగ నున్నది

ఆంధ్రపురాణకథావినోదములను వీరితండ్రిగారు పాడినారని సెలవిచ్చియున్నారు. కథలు పద్యరీతిగనో పదరీతిగనో పాడుట కొంతయాచారమే కాని వినోదము లెట్లు పాడవలయునో వా రెట్లుపాడిరో తెలియదు. మోదముతోడ 'ముచ్చట' యని యేకార్థపదము లారక్షరములయెడములోఁ దనతండ్రి గారినిగూర్చి మామిత్రులు ప్రయోగించియున్నారు. రెండింటికి మొత్తముమీఁద వేడుక యనియే యర్థము. పురాణకథలు పాడుచున్నందువలనఁ దండ్రిగారికిఁ గలిగినమోద మొకటి, బిడ్డఁడు తనపాటల నానందమున నాలకించుచున్నాఁడనుమోద మొకటి కలిసి వేడుకలు రెం డయ్యేనేమో!

ఆంధ్రపురాణకథావినోదములు జోలలుగ బాడినారని మామిత్రులు వ్రాసిరి. సీతమ్మసమర్త యని, బాలనాగమ్మ పాట యని, జోల, లాలి, నలుఁగుపాట లని, వాడుకగ నున్న

పాట లన్నియు నొడలిమీఁదియలంకారములవలె స్త్రీధనమై యున్నవికాని వానికై పురుషు లపేక్షపడినట్లు వినియుండలేదు. తూర్పున నాచార మెట్లున్నదో కాని, యీమధ్యదేశమున నేమి, దక్షిణదేశమున నేమి, మగవాఁడు "హాయి హాయీ హాయి—ఆపదలు గాయి" యని పాడునాచారము లేదని యెఱుఁగుదుము. ఈకొత్తయాచార మేయింగ్లీషుగ్రంథమున నుండియైనమామిత్రులుసంగ్రహించిరేమోయని యూహింపఁగ నాంగ్లేయులలోనైన 'Father's Lullaby' అని యున్నదని మే మెఱుఁగము. పోరుపెట్టుచున్నపిల్లవాని శాంతిపఱచుట తల్లి సొమ్ముకాని తండ్రిచేనైనపని కాదు. పిల్లవానితోట్టెయొద్దకుఁ బోయి, పదునాల్గు 'జావళీలు' తండ్రి పాడిననైన బిడ్డఁడుకన్ను మూయునా? తెఱచిననోరు తెఱచినట్లే యుండును. ఏడ్చిన యేడ్పు లేడ్చినట్లే యుండును. తండ్రి కాంభోజివర్ణమునకుఁ బిల్లవాని'క్యారుక్యారు'రవముపాంగముగనుండును.ఎంతపాడినను బందుకొనలే దనుకోపముచేఁ దండ్రి యొకపుడు పిల్లవాని బుగ్గను గిల్లి పోవచ్చును. అనురాగపూర్ణము లగుతల్లికన్నుల నుండి వెడలినయనన్యసాధారక మగువిద్యుచ్ఛక్తితో నర్భకుఁడు శాంతింపవలయును. సర్వదా పూర్ణపరిచయము కలతల్లిమృదుల రవమున బయలువెడలిన 'పిల్లెమ్మకన్నులు బీరపువ్వులు' అనుగీతము చెవినిఁ బడినప్పుడే పిల్లవానికన్నులు మూఁతపడ వలయును. ఈమాత్రపుగృహవ్యాపారస్థితి మామిత్రుల కిప్పటికిఁ

దెలిసి యుండఁదగినదే! అయిన నివ్వి ల వ్రాసిరో తెలియదు. మాయైదుగురిలో నొక రీతిగఁ బైయంశమునకుఁ బూర్వ పక్షము చెప్పిరి.

వీరితండ్రిగారు జోలలు పాడలేదు. జోలలుగఁ బాడి నారని గ్రంథకర్తగారు సెలవిచ్చి యున్నారు. తల్లి జోల లెట్లు పాడునో తండ్రిగారు పురాణకథాగీతములను వీరియొద్దఁ బాడి రని యనుకొనవలయును గాని, వీరే జోలపాడిన ట్లెంచఁదగదని వా రధిక్షేపించిరి. అప్పుడు మఱియొకరు "ఆయర్థ మెంతమా త్రము నాకగుట లేదు. జోల లనుశబ్ద మనుచితముగఁ దం డ్రిగారియెడలఁ బ్రయోగింపఁబడినది. సరే! తల్లిగారే జోల పాడిరి. తల్లిగారే నిద్రపుచ్చవలయును గాని తండ్రిగారు నిద్ర పుచ్చినట్లు గ్రంథకర్తగారు "జోలలుగ ముచ్చట బాడుచు, నిద్రపుచ్చుచుఁ" అని వ్రాసిరేల? అని ప్రత్యుత్తర మిచ్చెను. అంతట—

మొదటియధిక్షేపకుఁడు :—పురాణకథాగీతములు మాత్రము పిల్లవానిని నిదురపుచ్చఁజాలవా? 'సంగీతము' చిత్తా వేగము శాంతిపఱుపదా?

రెండవయాతఁడు :—చిత్తావేగమును శాంతిపఱచుటకు సనత్సుజాతీయ మెందులకు? శాంతిపర్వగాథ లెందులకు? నిరర్థక మగుమృదురవముతో నిదురింపవలసినబాలునిగూర్చి భక్తి జ్ఞానవైరాగ్యబోధకము లగుపాట లెందులకు? ఈపాటలే తన్ను

"బోధ లెఱుంగ నాకథలజ్ఞానమె సువ్రతు జేయు" ననుపవిత్రోద్దేశముతోఁ దండ్రిగారు పాడినట్లు మనమిత్రులు సెలవిచ్చినారు కదా! జోలలవలనఁగాని నిదురింపని కేవలశిశువునకు సుందరకాండగాథ యెందులకు? తనపాటలవలనఁ బుత్త్రినిచిత్తకమలము వికసింపవలయునని యాతఁడు పాడెనుగాని నేత్రపద్మములు ముకుళింపవలయునని కాదు కదా! కేవల మంతచిన్నవయస్సుగలయజ్ఞున కవి యేల? ఇన్నియేండ్లు వచ్చినమన మైనను నిదురవచ్చుటకొఱకుఁ బనికిమాలినవార్తాపత్రికను జూతుము కాని పద్మాసనము వైచుకొని బ్రహ్మసూత్రపారాయణ మొనర్తుమా?

మొదటి:—మఱియు నంతచిన్నవయస్సని యనుకొన నేల? ఏడెనిమిదేండ్లవయసులో నున్నపుడు చిన్నచిన్ననీతికథలను దండ్రిగారు చెప్పినారని యనుకొనరాదా?

రెండవ:—అటులైన జోలలుగఁ బాడి రని చెప్పనేల? జోలలు బాడినఁగాని యేడుపు మానని యెనిమిదేండ్లగుడ్డును మాత్రము కన లేదు; విన లేదు. ఉపనయనపుటీడుబాలుని నిద్రకై "ఉళళఉళళ" యనవలయు నేమి? అటులైన నేను గూడ తేపు తొట్టెలోఁ బండుకొని 'క్యారు' మందును.

మాలో నంత నుత్తరప్రత్యుత్తరములు శాంతించినవి. "బోధ లెఱుంగ నాకథలజ్ఞానమె సువ్రతు జేయునంచు నన" అనునది మూఁడవపాదము. ఆకథలవలనఁగలిగినజ్ఞానమె

నన్ను సువ్రతుని జేయునని తండ్రిగారియభిప్రాయము. సరే. ‟బోధ లెఱుంగ” దీని కర్థమేమో దేనితో దీని కన్వయమో బోధపడ లేదు. ‟బోధలెఱుఁగుట” కని యర్థమా?” ‟ఎఱుఁగఁగా” నని యర్థమా? ఏదియైనను దీనిని దేనితో ముడి వేయవలసినది? బోధ లన నేమి? వానినెఱుఁగుట యన నేమి? బోధ లన జ్ఞానము కాదా? ఎఱుఁగుట యనఁగ జ్ఞానము కాదా? ఈ రెండుజ్ఞానములు కాక ‟నాకథలజ్ఞాన మని” మూఁడవజ్ఞానమన నేమి? మూఁడుజ్ఞానము లిటుఁ గూడినను జనులకర్థవిషయమై యీయజ్ఞాన మేమి? అగాధ మగుకవిహృదయమున నేమున్నదో యేమిలేదో మన కెట్లు తెలియును?

‟బోధ లెఱుగుట” యనఁగ ‟ బుద్ధి వచ్చినతరువాత—సదసద్వివేచనము గలిగినతరువాత” నని యర్థమని మాలో నొకరు చెప్పిరి. బోధ యనఁగా బుద్ధి; జ్ఞానము. ‟బుద్ధి వచ్చిన తరువాత’, ననికాని ‟జ్ఞానము వచ్చినతరువాత” నని కాని ‟ తెలివి కలిగినతరువాత” ననికాని వాడుక చేయవలయును గాని బుద్ధి తెలిసినతరువాతనని కాని జ్ఞానము తెలిసినతరువాత ననికాని యనరాదు. అట్లనుట తప్పు. ఇట్లే వీరు 10వ పేజీలో యుక్తాయుక్తజ్ఞానము తెలుస్తుంది” అని ప్రయోగించినారు. జ్ఞాన మనఁగనే తెలియుట యగునప్పుడు ‘ తెలియడం తెలుస్తుంది’ అని వ్రాయుట సాహేబుగారిదర్శనమును జూచి నా నని యనుటకంటె నసందర్భముగ నుండును. ఇట్లు

పండితులు కాని పామరులు కాని మాటలలో నెవ్వరును బ్రయోగింపరు.

“గాదిలిపట్టి తచ్ఛ్రవణకౌతుకు జేసిననాదుతండ్రిక” యనునది నాల్గవపాదము. అమావాస్యాంధకారముచే బాధ పడుచుండ నాకాశము మేఘచ్ఛన్నముకూడ నైనయట్లు, లన న్వయాదిదోషములచే నర్థము విడక కొట్టుకొనుచుండఁగా నర్థానుస్వారరాహిత్యమున నంతయు నరణ్యప్రాయ మై యు న్నది. ప్రథమ యేదో ద్వితీయ యేదో తెలియనిబాధకూడ వచ్చినది.

“క, ణ్వాదుల బోలుసత్యఋషి లచ్చనమంత్రి దలంచి చెప్పెదన్” అనునది యయిదవపాదము. కణ్వుఁడు ఋషులలో నత్యంతప్రసిద్ధుఁడు కాఁడేమో? కణ్వుఁడు బ్రహ్మచర్యదీక్షఁ గలవాఁ డనిశాకుంతలములో నున్నది. అట్టిదీక్ష కలయీ ఋషిని గృహస్థునితోఁ బోల్చుట యంతబాగుగ లేదేమో? యని యనుకొనుచున్నాము. ఏకపత్నీవ్రతదీక్షయే బ్రహ్మ చర్యవ్రతమువంటి దని పెద్దలు చెప్పిరికావున పీ రిట్లు వ్రాసి రేమో? సత్యఋషు లని కొందఱు, నసత్యఋషు లని కొందఱు లోకమున నుండరు కాని వాడుకభాషలో మాత్రము “అతఁడు సత్యఋషి” యనఁగఁ బరమసాత్వికుఁ డని యమాయకుఁ డని యర్థ మున్నది. ‘మంత్రి’ యనుటచే వీరు నియోగు లనుట స్పష్టము. “చెప్పెదన్” అనఁగాఁ గృతి నని యధ్యా

హారము కాఁబోలు.

నిద్రపుచ్చుట యని, జోలలుగాఁ బాడుట యని విను కవితాచమత్కృతి యనుభ్రాంతిచే ననిరి కాని నిస్పష్టమైన యభిప్రాయ మిది.

"నాకు రవంతజ్ఞానము వచ్చినది మొదలుకొని యాంధ్ర పురాణగాథలను నేనుత్సాహమున వినునట్లుగా నేను నిద్ర పోవువఱకు మాతండ్రిగారు చెప్పుచుండెడివారు. నే నాకథల లోనినీతులను గ్రహించి మంచిప్రవర్తనము కలవాఁడ నై యుండవలయునని ముద్దుబిడ్డఁడ నైన నాకొఱకు వా రింతశ్రమ పడిరి. అట్టిపరమసాత్వికాగ్రగణ్యుఁ డగుమాతండ్రిగారిని స్మ రించి యీకృతి నారంభించుచున్నాను."

లోకమున నిట్టితండ్రు లరుదు కదా! "నాయనా! నక్క ద్రాక్షపండ్లపాఠము చదువకయే నిద్రపోవుదువా" అనునట్టి తండ్రులే కాని "నాయనా! రామమూర్తియే యడవికిఁ బో వలసి యుండ, సవతితమ్ముఁ డైన సౌమిత్రి తన్నుఁగూడఁ దీసి కొనిపొమ్మని యెంత ప్రార్థించుచున్నాఁడో వింటివా? ఇదిగో! ఈపద్యమును వినుము. భ్రాతృస్నేహ మన నిట్లు లుండవలయు ను జుమా తండ్రీ" యనిబోధించుతండ్రు లిప్పుడు లోకమున నెంతవిరళముగ నున్నారు! ఆహా! లచ్చన్నమంత్రిగారియీాయ త్యుత్తమగుణమును దలఁచుకొన నిజముగ మాకు మహానంద మగుచున్నది. దీనివలననే వీరిపూర్వాచారపరాయణత, పురా

ణాదిగ్రంథపఠనాసక్తి, నీతివర్తనమందు నిశ్చలమైననియమము మొదలగుసద్గుణములు తెలియుచున్నవి. వీరు భాగవతభారతాదిగ్రంథముల నెన్నిమాఱులు చదివి యెంతగ నానందించిరో? గ్రాంథికభాషయందు వీరి కెంతయాదరమో! తండ్రియగువాఁడు తనకంటెఁ దనకొడుకు యోగ్యతరుఁడుగనుండవలయునని కోరుకొనుచుండును. మనమిత్రులు కూడ సత్ప్రవర్తనము గలవారని విని సంతసించుచున్నాము. తండ్రిగారిబోధము ఫలింపకపో లేదు కాని తండ్రిగారేభాషయందు మహాదరము కలవారై యుండిరో యేభాషలోఁ బ్రాజ్ఞులు కావలయునని బాల్యమునుండియు మామిత్రులకు నిరంతరదీక్షతో బోధించిరో యా గ్రాంథికభాషయందు వీరికి వైరాగ్యము కలుగుటయేకాక కేవల మగ్రాంథికభాషయం దాదరణము కలుగుటమాత్రము మాకు—నిజము చెప్పవలదా?—విచారకరముగ నున్నది. అట్టి గ్రాంథికభాషాపాండితీపరాయణున కీగ్రామ్యగ్రంథమును గృతి యిచ్చుట యంతబాగుగ లేదేమో యని సంకోచించుచుఁ జెప్పవలసివచ్చినది. “మీరు చేసినశ్రమము ఫలించినది కాదని” తండ్రిగారి కిట్లు జ్ఞప్తికిఁ దెచ్చుట యెత్తిపొడుపుగ నుంటచే బొత్తిగ బాగులేదని మాయభిప్రాయము. చేయుచున్నశ్రమము ఫలింపదని యెఱిఁగియున్న “విదితజ్యోతిషమర్ముఁడై”నతండ్రిగారీశ్రమ మేలచేసిరో మాకు బోధపడ లేదు.

విశేషాభిప్రాయమును లేనియీపద్యమును బంచపాదిగఁ

జెప్పనేల యని మాలో నొక్కరు శంకించిరి. విమర్శించి విధ్వంసము చేయుటకు మన కయిదుగుర కైదును జెప్పినారని మఱియొకరు నవ్వుచుఁ బ్రత్యుత్తర మిచ్చిరి. ఇఁక ముందు పద్యమునకుఁ బోవుదము. ఇప్పటి కేపద్యమున కాపద్యమే విమర్శించి పిదప నీపద్యములలోనిసామాన్యగుణలోపము లన్నియు సంగ్రహముగఁ జెప్పుదుము. తరువాతిపద్యము

"మానవసేవయు న్నతిథిపాలనముల్ పతిపూజయుల్ సదా
భానుడె దైవమంచు దృఢభక్తియు మేలగుచిహ్నలౌట నా
భానుమతీశచీమణులమాదిరి సువ్రత సత్యకామ స
న్మానిని రామయాంబ మది మజ్జననీ దలతుఁ శుభార్థినై."

ఈపద్యమున మాగ్రంథకర్తగారితల్లిగా రగురామయాంబగారిసుగుణసంపద వర్ణింపఁబడినది. మానవసేవయం దతిథిసత్కార మిమిడియున్నది. మానవసేవ యనఁగ మాకు బాగుగ బోధపడలేదు. అతిథిసత్కారమే కాంతామణులు సేయుమానవసేవ కాదా? దానికంటె సతులు చేయుమానవసేవ యే మున్నది? బంధుమిత్రగణసేవ యయియుండునా? బంధువు లందఱు మానవు లగుదురు? కాని మానవులందఱు బంధువులు కారు. బంధుమిత్రసేవ యనక సాధారణమైన మానవశబ్దమును వీ రేల ప్రయోగించిరో స్పష్టపడ లేదు. ఒకవేళఁ దటాకాదిప్రతిష్ఠలు చేసి వీరు మానవసేవ చేసిరేమో? ఎవ రెఱుఁగుదురు? తల్లిగారు చేసినపనులనుబట్టి తనయుఁడు

వాడినపలుకుల కర్థము తెలియవలయును గాని వీరిమాటలను బట్టి వారు చేసినసత్కార్యము లేవియో తెలిసికొనుటకు వీలు లేకున్నది. గ్రంథకర్తగారి నడిగి తెలిసికొనవలయును గాని యంతకంటె వేఱుమార్గ మేమున్నది? ‘ మానవసేవ ’ యనఁగ లక్ష్మీదేవిని గూర్చి నూతనమగుసేవ యని (మా + నవ + సేవ) యర్థ మేమో యని మాలో నొక్కరు పలికిరి. కుంటికాలిపైఁ గుఱుపుకూడ వైచిన ట్లీయనన్వయాదిదోషబాధలలో నేకాక్షరప్రయోగబాధకూడనా యని మఱియొకరు పరిహసించిరి.

తల్లిగారిహృదయ ముదారమని యిటఁగవి వర్ణించినట్లు కొంత గోచరించుచున్నది. ‘ చతుశ్శ్లోకేన పండితః ’ యనునట్లీనాల్గుపద్యములతోడనే మనమిత్రులు కవి యయిరాయని మాలో నొకరు పలికిరి. ఈమెహృదయానురాగము సోదరభావమున సర్వసాధారణముగ నందఱియందును వ్యాపించి యున్నది.అతిథులయందుమాత్ర మీమెయనురాగముహెచ్చు. అనురాగవ్యాపనమునకు వైశాల్యము తగ్గినకొలఁది నామె ప్రేమ గంభీర మగుచున్నది ఇదియే యతిథిపాలనము. భర్తకంటెఁ బతివ్రతకుఁ బ్రేమావధిస్థానము లేదు. ఇచ్చట ననురాగమునకు వైశాల్య మంతయుఁ దగ్గినది. అంతయుఁ బ్రపూర్ణముగ భర్తయం దుంచఁబడినది. ఇదియే పతిపూజ. ఇచ్చటఁ ‘ బూజా ’ శబ్ద ముచితముగ నున్నది. ఐహికప్రేమముతో భక్తిమేళన మున్నట్లు కవి కనఁబఱచినాఁడు. దీనిపైది

దైవభక్తి. ఇది యాముష్మికవస్తుప్రేమము కావునఁ బతిప్రేమ కంటె హెచ్చు. ఇచ్చట ననురాగమును నిచ్చెనమెట్లపై నెక్కించిన ట్లున్నది. ఇట్లుచేయుట కవియభిప్రాయమే యగు నెడల నట్టియభిప్రాయ ముచితవాక్యములతో వెల్లడింపలేక పోయెను. ఈనాల్గుగుణములు కాంతలకు మేలగుచిహ్నము లగుటచేతఁ దనతల్లిగారు భానుమతీశచీమణులవలె &c. &c. అని కవి చెప్పినారు.

భానుమతి యెవ్వరు? దుర్యోధనునిభార్య భానుమతియని భారతమందుఁ జెప్పఁబడి యున్నది. ద్రౌపదీగాంధారీనామముల వలె నీమెపే రచ్చట నంతగ వినరా దయ్యెను. అందుచే నీమె స్వరూపస్వభావములు బాగుగాఁ దెలియవు. ఈమెపే రైనను లోకు లెఱుఁగ నంతమానవతియని స్త్రీలోకమున నొకచిన్న సామెత యున్నది. అదిగాక విజయనగరవాస్తవ్యు లగుశ్రీ భాగవతుల రామమూర్తిశాస్త్రిలవారు రచించినవిక్రమార్క చరిత్రమున నొకభానుమతి యున్నది. అహంయాతిభార్యయుఁ గార్తవీర్యార్జునుని చెల్లెలు నగునొకభానుమతి యున్నది. కృష్ణుని పినతండ్రియగుభానునికూఁతురునుసహదేవునిభార్యయు నగునొక భానుమతి యున్నది. ఇందఱుభానుమతులలో—నేభానుమతిని మామిత్రు లుద్దేశించిరో? ఎట్లు తెలియవచ్చును? అసందిగ్ధ నామ లగుమహాపతివ్రత లనేక లుండ నీమెనే వీ రేల గ్రహించిరో తెలియదు. ఐనను మొదటిపద్యమున "మోదములోడ

జోలలుగ’’ నని యున్నహేతువుచేత సుప్రసిద్ధ మగుభారత మందలిభానుమతినే కవి యుద్దేశించెనని యనుకొనఁదగునేమో? ‘ శచి ’ యనునది దేవేంద్రునిభార్య యని యంద ఱెఱుఁగుదురు కదా! భానుమతీశచీమణు లని సమాసమును గూర్చినారు. శచీ భానుమతు లని యుండిన బాగుగ నుండు నేమో? మణిశబ్దము జాతివాచకముపైఁ బ్రయోగింపఁ దగునుగాని యిట్లు ప్రయోగింపవచ్చునా? కాంతామణి యనవచ్చును గాని కుంతీమణి యనఁ దగదు. అబలామణి యనఁ దగునుగాని యచ్చమ్మమణి యనఁ దగదు. పైని జెప్పఁబడిననాల్గుగుణములు మేలైనచిహ్నము లగుటచేత, ‘ భానుమతీశచీమణులమాదిరి etc. ’ అని చెప్పుటవలన నీనాల్గుగుణములు ‘ భానుమతీశచీమణుల ’ కుండ వలదా? భానుమతికి మానవసేవయు, నతిథిపాలనము, పతిపూజయు నున్నవి యనియే చెప్పుదము. నిత్యము నీమె సూర్యోపాసనముఁ జేయునని వీరి కెట్లు తెలిసెనో మేము తెలియఁ జాలము. భారతమం దీయభిప్రాయ మున్నట్లు మే మెఱుఁగము. కాని వేణీసంహారనాటకమున భానుమతి సూర్యు నొకమా ఱుపాసనముఁ జేసిన ట్లున్నది. నకుల మొకటి నూఱుపాములను జంపివైచె నని యామె కలఁ గనుటచేఁ దత్స్వప్నదోషనివారణార్థముగ సూర్యోపాసనమును జేసెను. కల యెంతకల్లయో యుపాసనముకూడ నంత యుత్తది. రెండును గవికల్పితములే! దీని నాధారమును జేసికొని భానుమతికి సూర్యోపాసన మున్నట్లు

శవి స్థిరపఱచినట్లు తోఁచుచున్నది. ఒకవేళ భానునిఁ గలది (బుద్ధిమతి, గుణవతి &c. వలెను) కావున భానుమతి యనికాని భానునిమతియందుఁ గలది కావున భానుమతి యనికాని వీరు విపరీతార్థమును జేసికొని, యామెకు సూర్యోపాసన మున్నట్లు స్థిరపఱచి రేమో? కాక మఱి యేమియాధార మున్నదో మాకుఁ దెలియదు. ఇఁక శచీదేవి కీనాల్గుగుణము లేమాత్ర మున్నవో చూతము. 'మానవసేవ' ఇది మందునకైన లేదు, ఆమె మనుజుల నేల సేవించును? 'మానవసేవ' యనఁగ మానవులు చేయుసేవ యని యర్థము చేయ రాదా? యని మాలో నొకరు శంకించిరి. మానవు లామెను సేవించిన ట్లే గ్రంథమందు దున్నదో మే మెఱుఁగము. జీవు లీలోకమున నున్నంతవఱకే మానవులు. వీరు దేహమును బాసి దేవలోకమునకుఁ బోయి యామెను సేవింతురని యెవ్వరివలననైన వినియు నుండలేదు. వీరి కెట్లు తెలిసెనో? 'నతిథిపాలన మ' ని పోతనామాత్యుని వెక్కిరించిరో? గణము కుదురక కక్కుఱితియే పడిరో? మానవ సేవ శచి కుండదుకాని యతిథిపాలనము, పతిపూజయు నుండ వచ్చును. అతిథిపాలన మనుశబ్దము రసవంతముగ లేదు. అతిథులను గృహస్థులు పూజింతురు. వారి సేవ తమకుఁ దరణోపాయముగ నూహింతురు. అట్టిచోఁ బాలన మనుట బాగుగ లేదు. నాలుగవది యగుసూర్యోపాసనముకూడ శచి కుండదు. ఉండు ననుట తప్పు.

"మానవసేవాదిగుణములు భానుమతీశచీమణుల కుండ నక్కఱ లేదు. వారివలెనే రామయాంబగారు 'సువ్రత, సత్యకామ' యగుదు రని ముందున కన్వయము" ని మాలో నొక్కరు పలికిరి. వెనుకకో ముందునకో, క్రిందికో మీఁదికో, యెట్టులో యన్వయము కుదిరినఁ జాలునని మిగిలినవా రనిరి. కావున సువ్రతత్వసత్యకామత్వములు భానుమతీశచీమణుల కుండవలదా? శచీమణి గోపద్మవ్రితము చేసినదని చెప్పుదురా? ఋషిపంచమి నోఁచినదని చెప్పుదురా? సత్యకామశబ్దమున కర్థము సందిగ్ధముగ నున్నది. "భారూప స్సత్యకామ స్సత్యసంకల్పః" యనునుపనిషద్వాక్యమున సత్యకామశబ్దము భగవత్పరముగా నుపయోగింపఁబడి యున్నది. దీని నిచ్చట నుపయోగించుట సమంజసముగ లేదని మేమువిన్నవించుచున్నాము. 'సతి+అకామ' అని పదచ్ఛేదము చేసినను సందర్భముగ నుండలేదు. రామయాంబకు, మజ్జననికి, మధ్యమున 'మది' యడ్డు వచ్చినది. "మ జ్జ న ని" కేవలగ్రాంథికప్రయోగము. "నిష్ప్రయోజనముగఁ గేవలగ్రంథస్థములై వాడుకలో లేని పదముల నుపయోగించలేదని నానమ్మిక" యని వ్రాసినమా మిత్రులు దీని నేల యుపయోగించినారు? 'మత్' అనునది నిష్ప్రయోజనము కాదా? 'నాజననిṁ' అనఁ గూడదా? 'మత్' అని యతికొఱకు వైచిరేమో యని మాలో నొకరు శంకించిరి. యతినియమమును బాటింపనివారి కాసందేహముతోఁ బనిలే

దని మఱియొకరు పలికిరి. అది గాక 'నా' యన్నను యతి పోదు. కాని 'మాతల్లి' యందురు కాని 'నాతల్లి' యనుట వాడుకలో లేదు. అటులైన 'మాజననీ' యనవచ్చును గాదా? "లక్షణముతోఁ గాని, మాకు మాటలతో పనిలేద" నువిశేషవాక్యబలముచే నిట్లు వ్రాసి రేమొ? "తలతుఁ" అనఁగా స్మరియింతును.

తరువాతిపద్యమును విమర్శింతము.

" సారస్వతప్రపంచ ము
దారత్వము చూపుసరణి దా మరువంగా
సరసమగుగద్యకావ్యము
సరసత నీరసత జూప సరవి రచింతుఁ."

దీనిమొదటిరెండుపాదములయర్థము మాలో ముువ్వరకు దుర్బోధమైయుండెను. 'తాఁ' అనుశబ్దమున కొకరు పాఠకుఁడని యర్థము చెప్పిరి. మఱియొకరు గ్రంథకర్తయనియర్థమును జెప్పిరి. ఈపాదద్వయమున కెఁక నర్థము కుదుర దని వారిర్వురును నిరాశను జెంది యుండగా మూఁడవవారు "తాఁ" అనుదానికి 'సారస్వతప్రపంచ మనియే' యర్థ మనుచు, సారస్వత ప్రిపంచ ముదారత్వమును జూపుసరణిని "తాను" అనఁగా సారస్వతప్రపంచమే మఱచిపోఁగా నని యభిప్రాయ మనియుఁ జెప్పిరి. ఇది యాంగ్లేయవాక్యపుబందుకట్టున కొకమాదిరి యాంధ్రీకరణ మగుటచే దీనియర్థ మింతదుస్సాధ్య మగుటకు

గారణ మైనదనియుఁ జెప్పిరి. అదిగాక యిదియే గ్రంథకర్త యభిప్రాయ మయియుండుననని స్పష్టపఱచుటకుఁగాను వారే యిట్లు తిరుగఁ బలికిరి.‹‹కవిత్రయమువారికాలములోను వారికిఁ జేరువనున్నవారికాలములోను గలిగినసారస్వత మభిప్రాయాచార్యప్రధాన మై యుండెను. వారితరువాతఁ గొంత కాలమునకు గ్రంథరచన చేసినప్రబంధకవు లీయభిప్రాయ గాంభీర్యమును విశేషముగఁ బాటింపరైరి. శబ్దయమకములు, శబ్దశ్లేషలు, నేకాక్షరద్వ్యక్షరపద్యరచనలు, నర్థద్వయార్థత్రయార్థచతుష్టయసహితప్రబంధనిర్మాణములు, బంధనిర్బంధములు, ననులోమవిలోమక్రమపద్యసృష్టులు, భాషాద్వయసాంకర్యసహితపద్యకల్పనలు, మొదలగునసాధారణప్రక్రియలు వీరిప్రబంధములయందుఁ దఱచుగఁ గానవచ్చుచున్నవి. ప్రబంధ వర్ణన లన్నియు లెక్కప్రకార మొక్కటితరువాత నొక్కటి క్రమముగాఁ దమప్రబంధములఁ బ్రవేశపెట్టుటయే కొంత ప్రధానకార్యమని వీరు యోజించినట్లు కానఁబడుచున్నది. ఈ యిరువదిరెండువర్ణనలలో దేనినైన వదలివైచినయెడలఁదాము రచియించినది ప్రబంధము కాదని లోకులు బరిహసింతు రను భయముచేఁ గథకు సంబంధించిన సరే, సంబంధింపకున్నసరే, కథ ననహజముగ మార్చియైన నావర్ణనలన్నియుఁ దప్పకుండఁ దమప్రబంధముల వ్రాసియే తీఱినట్లు తోఁచుచున్నది. కథా విషయమునుబట్టి వర్ణన లుండవలసియుండఁగా వర్ణనలను బట్టి

కథావిషయ ముండునట్లు చూచుకొనిరి. అది గాక మొత్తము మీఁద నన్నిప్రబంధములకుఁ గూడఁ గొంచెము హెచ్చుతగ్గుగ నొక్కటియే కథ. ఒకరాజు సభలో మంత్రిపురోహితాది వర్గముతోఁ గూరుచుండుట, జానపదులు వచ్చి మృగబాధ యేదో తమకు సిద్ధించిన దని మొఱపెట్టుకొనుట, రాజు వేఁటకుఁ బోవుట, యడవిలో నెచ్చటనో యొకకన్యకామణిని గాంచుట, యామెకొఱ కీతఁడు నీతనికొఱ కామెయు విరహబాధచే విలపించి పాపము పుణ్య మెఱుఁగనిభ్రమరాదులను బడఁదిట్టుట, విదూషకసంధానమున వారు తిరుగఁ గలిసి వివాహమాడుట, వీలు కలిగినయెడలఁగాని విధిలేకకాని పుత్త్రిని గనుట; శ్రీ మొదలిశ్రీవఱకుఁ గొంచెము మార్పులతో నిదియే కథ.

ఒకప్రబంధమును జదివినయాతఁడు రెండవదానిని జదువ నక్కఱ లేదు. ఎంతసేపు శబ్దములతోఁ గుస్తిపట్టులలోనే కాని యర్థములకూర్పులోఁ బట్టుదల లేదు. పద్యములు గలగలమన్నఁ జాలును. గట్టుమన్నఁ జాలు! చెవులకొఱకే కాని చిత్తము కొఱకుఁ జెప్పినకవిత్వమువలెఁ గానఁబడదు. ఇది యాకాశము వలె శబ్దగుణప్రధానమే! బాలురదీపావళివేడుకవలె నర్థనాశక శబ్దాడంబరసహిత మై యున్నది. నూఱునూటయేఁబదిసంవత్సరములలోపున నున్నప్రబంధకారకులయీవెఱ్ఱికి గురుఁ డేకాదశమున నుండెను. ఈప్రబంధకారకులు తత్పూర్వప్రబంధకర్తలలో నెవ్వరినో ప్రబలాదర్శముగఁ బరిగ్రహించి వారు

చెప్పినన్నియాశ్వాసములే రమారమిగ వారు చెప్పినన్ని పద్యములే, వారొనర్చినకల్పనలతోడనే, గీతమునకు గీతము, సీసమునకు సీసమును రగడకు రగడను జెప్పఁదొడఁగిరి. వీరి కాలములోనే పిల్లవసుచరిత్రలు, పిల్లపిల్లవసుచరిత్రలు, కుప్పతిప్పలుగ బయలుదేఱినవి. అన్నిప్రబంధముల కొక్కటే విషయము. ఒక్కటే కల్పనము. ఒక్కటే మార్గము. తూఁచిన యెడలఁ గొంచెము హెచ్చుతగ్గుగ నొక్కటే యెత్తు! మూఁడవపత్రమునఁ బురవర్ణనము నేడవపత్రమునఁ బుష్పలావికావర్ణనము నిరువదితొమ్మిదవపత్రమున వేఁటవర్ణనము ముప్పదిమూఁడవపత్రమునఁ జంద్రోపాలంభనము నని కూడ మనము చెప్పఁదగినంతసాకారతతో సర్వప్రబంధములను సమకూర్చిరి. టంకసాలలోనినాణెములు. ముద్రాశాలలోనిప్రతులు. ఇట్టి గ్రంథకర్త లభిప్రాయౌదార్యమును బాటింపక యాలాప చమత్కృతినే గణించుటచే 'సారస్వతప్రపంచముదారత్వమును జూపుసరణియే మఱచిపోయినద' ని మనమిత్రులు పలుకవలసి వచ్చినదని నే ననుకొందును" ని వారు చెప్పినారు.

ఈయభిప్రాయమే కవియభిప్రాయము కాఁదగునని మేము నిశ్చయపఱచుకొంటిమి. సారస్వతప్రపంచ మనఁగ నన్ని దేశములలో నన్నికాలములలో నన్నిజాతులలో నిప్పటివఱకున్నవాఙ్మయ మనియర్థము. కవిహృదయ మిది కాదు. కాని శబ్దశక్తిమాత్ర మిది! వీరియభిప్రాయ మాంధ్రసారస్వతప్రపంచ

మనియే! ఈయభిప్రాయమైన స్థిర మగునెడల సంతోషమే! ఆంధ్రసారస్వతప్రపంచ ముదారతావిహీనముగా నున్నదని మనకవిగారు చెప్పినారా? నన్నయమొదలింతవఱకు నుదారకవి యెవఁడు లేఁడని వీరియభిప్రాయమా? బాగుగనే యున్నది. గోదావరియంతయు నిసుకయెడారియే యనినయెడల నింతకంటె బాగుగ నుండునేమో? కాని వీరు 2 వపత్రములో "భారత మందే యుద్ధపంచకము చదివినప్పుడు కలిగే అనుభవము వేరు. శాంతిపర్వము చదివితే కలిగే అనుభవము వేరు. ఇట్లు కావ్యములు మనఅనుభవములను అనేకవిధములుగా మార్చుతవి. కావ్యమునిర్జీవమైనప్పుడుఅదిమనస్సులఆకర్షింపలేదు"నివ్రాసిరి. ఇందువలన భారత మిప్పటికి బ్రదికి యున్నట్లును, భారతకవిత భావగాంభీర్యము కలదనియు వీ రంగీకరించినట్లును గనఁబడు చున్నది. మూఁడవపేజీలో "తిక్కనసోమయాజినిగురించికాని అతనిసమకాలికుల గురించికాని మనకు అంతగా తెలియక పోయినా విరాటపర్వము మొదలగుపర్వములు హృద్యములు కాకపోవు. ఇం తెందుకు? ఊర్మిళాదేవినిద్ర ఎవరు చెప్పిరో ఎవరి కెరుక. ఆపాట విన్నప్పుడు ఎవరికి మనసు కరగదు. కావ్యమునకు అనన్యాశ్రయ మైనసహజప్రతిభ కలదంటే ఇంతే!" అని మనమిత్రులు వ్రాసినారు. ఉత్తమోత్తమాంధ్ర గ్రంథరాజము నూర్మిళాదేవినిద్రతోనైన జోడించి, దాని యనన్యాశ్రయమైనసహజప్రతిభ కంగీకరించినారు.సంతోషమే!

మొత్తముమీఁదఁ గవిత్రియమునాఁటికవులకుఁ గొంతంత గౌరవమును వీరు కటాక్షించినారు. కావున వీరికాలపు సారస్వతమౌదార్యమును మఱవలేదనియే వీరియభిప్రాయ మనవలసి వచ్చుచున్నది. అది గాక సారస్వతప్రపంచ ముదారత్వమును మఱచిన దని వీరు చెప్పుటచేతనే యది యౌదార్యమును మఱవనికాలము కొంత యున్నదని యూహింపవచ్చును. ఆ కొంతకాలమే కవిత్రియకాల మని వీరియాశయముగా మనము గ్రహింపవచ్చును. అటులైనచో సారస్వతప్రపంచము (అనఁగ సర్వవాఙ్మయము) విస్మృతౌదార్యమైయున్నదని యేల యీ పద్యమునఁ జెప్పిరి? కృతిపద్యములలోనిప్రాఁతలకు గ్రంథములోనిప్రాఁతలకు సంబంధ ముండనక్కఱలేదా? దేనికి దానికే "యనన్యాశ్రియ మైనజీవితమా?" ముందుమాటచే వెనుకమాట సంమగొట్టుటా? "శ్రీరస్తు చిరంజీవు లగుమా అన్నగారిక" ని "చిఱునామా" వ్రాయవచ్చునా? "గంగాభాగీరథీసమానురాలగుమీబావమఱఁది అనేకసలాములు" ని తరువాత గ్రంథము వ్రాయఁ దగునా? ఇట్లెవ్వరైన వ్రాసినచో మామిత్రులు వారి నేమందురు?

సరే! తగ వేల? కవిత్రయసారస్వతమును మనమిత్రుల "సారస్వతప్రపంచము" నుండి తీసివైచెదము. అవశిష్ట మంతయు నుదారాభిప్రాయశూన్య మనియే వీరియభిప్రాయమా? రెండవ పుటలోనే "వరూథినీప్రవరాఖ్యులు, గిరికావసురాజులు తెలుఁగు

వారిహృదయమందు నేటికిన్నీ జీవించియున్నారు. వీరు చిరంజీవు లనడానకు సందేహ మేమి?" అని మామిత్రులు వ్రాసి యున్నారు. ఇందువలనఁ బ్రబంధకారులలో వీ రైన భావ గాంభీర్యమును బాటించినట్లు స్పష్టము. ఇది గాక 11వపుటలో "పూర్వులు త్రొక్కినదారే త్రొక్కినా చేమకూరవెంకటకవి తనగ్రంథములలో మనకు కలిగేఅనుభవములు ఎన్నో సరసము గా చెప్పినాడు" అని వ్రాసినారు. ఇక్కడకు విజయవిలాససారంగధర చరిత్రములుకూడ నభిప్రాయౌన్నత్యమున్న మఱవని గ్రంథములే యనిమామిత్రులయభిప్రాయమని యెంచవలసియున్నది. ఇదిగాక వారు 11 వపుటలోనే "మహాకవులకు స్వతంత్రబుద్ధి ఎక్కువ అంటారు నిజమే. కాని వారు అందుకోసము తాపత్రయపడరు. పెద్దన్న, రామరాజభూషణుఁడు, ముక్కుతిమ్మన్న మొదలగు మహాకవు లేమిచేసినారు. అదివరకు మన తెలుగువా రంతా విని ఆనందించే కథలే వా రెత్తుకొన్నవి. ఆరాళ్లు ఆరప్పలే యెత్తుకొని ఆపూర్వులు త్రవ్విన పునాదుల పైనే వారు కట్టినారు త్రిలోకసుందర మైన దివ్యభవనములు." అని వ్రాసినారు. పెద్దన మొదలగుమహాకవులని సెలవిచ్చుటచేఁ బెద్దనాదు ల' నునాకృతి గణమొకటి మామిత్రులు కల్పించిరి. ఈగణమునఁ జేర్పఁదగినవా రింక నెందఱుందురో! కావునఁ గొంచెము హెచ్చుతగ్గుగఁ బూర్వప్రబంధకర్త లందఱు భావగాంభీర్యమును బాటించినట్లే స్పష్టము. కావున నీగ్రంథకర్తలు రచియించినసారస్వతము

కూడ మామిత్రులు చెప్పిన సారస్వతప్రపంచమునుండి తీసి వేయవలసివచ్చినది. ఇదివఱ కొకసారి కవిత్రయకాలసారస్వత మును దీసివైచితిమి. ఇప్పు డీప్రబంధకారులసారస్వతమును దీసివైచితిమి. ఈ రెండు తీసివేఁతలుపోఁగా శేషించినసారస్వతమే మనమిత్రులవద్యములోని ‹‹ సారస్వతప్రపంచము.›› పంచపాండవు లిప్పటికి ముగ్గురలోఁ బడినారు. నూఱుపాము లఱువదిలోఁ బడినవి. పాటున సముద్రము జంకినట్లు పరీక్షచే సారస్వత ప్రపంచము సడలుచున్నది.

కావునఁ బూర్వప్రబంధకర్తల ననుకరింపవలయునని మాత్రమే ప్రబంధములను నొరవడి వ్రాసినట్లువ్రాసినయనంతర ప్రబంధకర్తలు మొదలాధునికకవులవఱ కున్నసారస్వతమే యుదారాభిప్రాయదూర మని నిర్ణయింతెము. 10 వ పుటలో ‹‹ మంచికో చెడ్డకో సారస్వతములో (సంఘాభివృద్ధికిఅనువైనవి అట్టిఅభివృద్ధిని సూచించేవి) మార్పులు రాక తప్పదు.______ ›› ‹‹ ఇట్టితరుణము లాంధ్రసారస్వతచరిత్రమందు మూఁడుపర్యా యములు కలిగినవి. మొదటిసారికవిత్రయమువారికాలమందలిది. రెండవసారి కృష్ణదేవరాయలకాలమందలిది. మూడవసారి, రా: బ. కం. వీ. పంతులవారు వచనరచనకు దిగినవెనుకటిది.›› అని మామిత్రులు వ్రాసియున్నారు. కావున నిది ప్రబంధ కర్తలశకము కాదు. దానికంటె భిన్నమైనదని వీరియభి ప్రాయము కాదా? ఇట్టి మార్పు కాలవశముచేఁ గలిగినదనియు

నిది సంఘాభివృద్ధి కనుకూలమైన దనియు, నట్టియభివృద్ధిని సూచించున దనియు వీరియభిప్రాయము కాదా? నిజమే! ఇప్పటివారి కెవ్వరికిఁ గేవలపూర్వప్రబంధానుకరణమే ప్రధానముగనున్న ప్రబంధము లం దాదరము లేదు. ఆప్రబంధకర్తలు మహావిద్వాంసులనుటకు సందియము లేదు. వారిశైలి యసాధారణమాధురీధురీణ మనుటకు సందియము లేదు. కర్ణపేశలము లయి, మకరందబిందుసందోహసన్నిభము లై సుధావర్షణప్రవీణము లైన శబ్దజాలములఁ గూర్చుటయందే వా రెంతప్రయత్నమైనఁ జేసిరి. శబ్దమాధుర్యమే ప్రధానము. శబ్దమంజులత్వమే ప్రధానము. శబ్దప్రధాన మైనకవిత్వమున కర్థము నశింపదా? రొట్ట పెంచిన తీఁగ పూయునా? చిగిర్చినరసాలము కాయునా? శబ్దప్రధాన మగుకవిత స్వరప్రధాన మగుగానములోనికి దిగెను. అంతట గానములోనివిఱుపులు, సంధులు, నారోహణము, లవరోహణములు, తానపుబజాయింపులు, ముక్తాయింపులు, గలగలలు, రవరవలు కవితలోఁ గూడఁ బ్రవేశించినవి. వసుచరిత్రలోనిపద్యములనన్నిటి నిప్పటికి రాగతాళములతో గీతములవలెఁ బాడువారనేకు లున్నారు. కవితాగానములందు రామరాజభూషణుఁ డసాధారణప్రజ్ఞకలవాఁడు కావున నా రెంటిని దనగ్రంథములో మేళవించి వాని కన్యోన్యసౌందర్యమును సమకూర్చినాఁడు. అన్యుల కట్లు సేయఁ దరమా? తరము కాదని నరు లూరకుందురా? వసుచరిత్రకు మేనమామపోలికలు దింపుటకు సమకట్టిరి. ఇట్టి

వీరిప్రయత్నములు హాస్యాస్పదము లని చెప్పవచ్చును. Alexander Pope అనుకవి ననుకరింపవలయునని తరువాతి వారు కొందఱు ఆంగ్లేయకవిత్వమును గజముబద్ద కంపసు కొలఁతలోనికి దింపలేదా యని “మెకాలే” వ్రాయ లేదా? అటులే మనవారుకొందఱు రామరాజభూషణు ననుకరించి యాంధ్రకవిత్వమును దవ్వతక్కెడవ్యవహారములోనికి దిగలాగిరి. శారదాపీఠ మిక్కడకుఁ గోమటిదుకాణ మైనది. కాని యాకవు లట్లువ్రాయుటకుఁ గారణ మేమో మాలో నొకరిట్లు పలికిరి :—

“వారు స్వతంత్రులు కారు. అంతఱవలెనే వారుకూడ దేశకాలపాత్రబద్ధులు. అదిగాక వా రందఱు రాజపోషణమున నుండెడివారు. ఆకాలపుమహారాజులు వారిని దమయాస్థానముల కలంకారములుగఁ జేసికొనిరి. కృష్ణదేవరాయ లేలినవిద్యానగర సంస్థాన మార్యావర్తమునకు దక్షిణభాగముమాత్రమే రమారమిగ నాక్రమించి యిప్పటికి వారియేనుఁగులశాలయంతలోనికి జంకెను గాని కృష్ణదేవరాయలమూలమునఁ బెద్దనకీర్తి, పెద్దనమూలమునఁ గృష్ణదేవరాయలకీర్తియు నష్టదిగ్గజములవఱకు వ్యాపించియున్నవి. ఆకాలమున నన్నిటికిఁ బ్రభుఁడే ప్రమాణము. ప్రభునికవితారుచినిబట్టి కవికవితారుచికూడ నుండును. ప్రభుఁడెవ్వఁడైన శ్లేషకవిత్వము విని తలనూఁపినయెడలఁ దలఁ బగులఁ గొట్టికొనియైన నాస్థానకవి శ్లేషకవిత్వము చెప్పవలసినదే.

రాజు బంధకవిత్వమును విని మందహాసము సేసినయెడల నేమ్చుచునైనఁ గవి ఖడ్గబంధమో గోమూత్రికాబంధమో చెప్పి తీఱవలసినదే. ఆకాలసాంప్రదాయమది. ప్రభుసాంప్రదాయ మది. కవిసాంప్రదాయ మది. ఒక్కమనదేశముననే యీనన్నివేశమా? ఆంగ్లేయదేశమున రెండవ "ఛార్లెసు" రాజుగా నున్నప్పు డేమైనది? రాజభవనములందు, దైవనిలయములందు, గృహస్థులగృహములందు, ధర్మశాలలయందుఁ, బుణ్యప్రదేశములందుఁ, బూర్వమునఁ దిరిగినపరిశుద్ధకవిత సాని వీథులలో నొడలుబయలుసేయునసహ్యవస్త్రములతోఁ దిరుగ లేదా? చేతబాఁదిబుడ్డి పట్టుకొని తెయితక్క లాడలేదా? సంసారిగృహములలో మంచముక్రింద దాఁగలేదా? గట్టిగ నోరెత్తినప్పుడు కాలితాఁపులఁ బడలేదా? ఆకాలపునాటక కవులు భర్తలపరువులు తీసివైవ లేదా? సంసారిణుల సానులఁ జేయలేదా? గృహచ్ఛిద్రముల వీథిని బెట్టలేదా? ఉదరాదిపరాయణు లగుపందలను నాటకప్రధానపురుషులుగఁ జేయ లేదా? పాతివ్రత్యము, నీతి పనికిరానివని వానిని నాటకరంగము నుండి బహిష్కరింప లేదా? మగఁడు దేవానాంప్రియుఁడు; భార్య పరమదౌర్భాగ్యశిరోమణి యగునెఱజాణ; ఉపపతి సర్వలక్షణ సర్వకళాసర్వసౌభాగ్యసంపన్నుఁడు. ఇదుగో! వీరుపాత్రములు. వీరి కుపపాత్రములు త్రాగుఁబోతులు; తార్పుడుకాండ్రు. కల్లుదుకాణమో, "కాఫీ" సత్రమో, దేవాలయమో రంగము.

ఱంకుపురాణమే యితివృత్తము. భర్తృపరాభవమే భరత వాక్యము. నీతిసంహారమే నీతిబోధము. మూఁడువందల సంవత్సరములకిందట నాంగ్లేయకవిత్వపురంగిది. కవులు తెలివి తక్కువవారా? Sheridan వంటివాఁ డిట్టిగ్రంథములు వ్రాసినాఁడు. Sterne వంటివాఁ డిట్టిగ్రంథములు వ్రాసినాఁడు. కారణము సింహాసనస్థుఁడగు కాంతాలోలునిలో నున్నది. ఈ సన్నివేశమును జూచి చెడినకాలములోనైన మనకవిత యింత చెడియుండలేదని సంతోషింపవలసి యున్నది. గ్రంథములలో రసపోషణ లేకపోయినఁ బోనిండు; ద్రాక్షారససేవ లేదు. అభిప్రాయౌదార్యము లేకపోయినఁ బోనిండు; వ్యభిచారాది ప్రచారము లేదు. శబ్దములతోఁ బోట్లాటయయినఁ బోనిండు; వింతపద్ధకునితోఁ బోరాడి చెప్పుదెబ్బలు తినుట లేదు. నీతి లేకపోయినఁ బోనిండు; దుర్నీతి లేదు. మొత్తముమీఁదఁ బ్రభుఁడే కొంతకారణమని నే ననుకొందు”నని వారు చెప్పిరి. అంతట షూలో నొక రిట్లు ప్రత్యుత్తరమిచ్చిరి. “ఇతరదేశ సాంప్రదాయ మెట్లున్నదో నే నెఱుఁగను. కాని మన దేశమునమట్టునకుఁ బ్రభువులకవితాభిరుచివైఖరినిబట్టి ప్రబంధములు పుట్టియుండ లేదు. ప్రభువులు కృతిస్వీకరణమును బవిత్రకార్యముగ నెంచిరి. కృతి సప్తసంతానములలో నత్యుత్తమమైనదనియు, దానిని గ్రహించునెడలఁ దమవంశము వారు తరింతురనియు, మతవిషయకవిశ్వాసమునుగలిగియుండిరి.

ఇప్పటివఱకు నట్టివిశ్వాసము కొంతబలహీన మయ్యెను మిగిలి యున్నదికాని నామావశిష్టముగ నశింపలేదు. తా ము గ్రహించినకృతి ధరణియందు నిలిచియున్నంతకాలము తమ కుత్తమగతులుండునని పూర్ణవిశ్వాస మున్నభూనాథులుతమకుఁ దాత్కాలికముగ నున్నకవితాభిరుచులఁ బట్టి గ్రంథము లొనర్పుమని కవుల కెన్నఁడు నాజ్ఞాపించియుండరు. ఆశ్రితు లయ్యెను గవులను బ్రభువులు విశేషగౌరవముతోఁ జూచు చుండిరి. వారియెడల వారు గురుమర్యాదను జూపి యుండిరి; కాని సేవకానాదరణమును గనఁబఱచి యుండలేదు. ఎక్కడ నైన నొక్కగొప్పకవి యుండెనని వారికిఁ దెలియుటతోడనే వానిని బ్రార్థించి తమయాస్థానముల కలంకారములుగఁ జేసి కొనుచుండెడివారు. కవితాసంపత్తిచే స్థిరజీవు లగుకవుల సంబంధమునఁ దాముగూడ స్థిరజీవు లగుటకై ప్రభువు లెంత యైనఁ బ్రయత్నించిరి. వారు వారియుత్సాహమునకై రత్న హారము లిచ్చిరి. దాసదాసీవార మిచ్చిరి. అగ్రహారములిచ్చిరి. తమతో నేనుఁగులపైఁ గూర్చుండఁబెట్టుకొనిరి. అర్ధసింహాసన ములఁ దమతో సమముగఁ గూరుచుండఁబెట్టుకొనిరి. బావ యని యల్లుఁడని వరుసలతో వారిని బిలుచుకొనుచుండిరి. పూర్వప్రబంధకవుల కేకాక తరువాతిప్రబంధకవులకుఁ గూడ నాయాకాలపుభూపులవలనఁ గొంచెము హెచ్చుతగ్గుగ నిట్టి గౌరవము చూపఁబడెను. స్వబంధువులవలెఁ బ్రాణమిత్రుల

వలె వారిని బ్రభువు లాదరించి రేకాని తమవెఱ్ఱి వెఱ్ఱిరుచులను బరిపోషించినపాచకులుగ నొనర్పలేదు. అనర్ఘ కవితాసంధానమున దార్ఢ్యదుకాండ్రుగ నెంచలేదు. కవితాశైలినిగూర్చి యిట్టులట్టులని యెన్నఁడును వారికిఁ బ్రభువులు సూచించి యుండలేదు. గ్రంథవిషయములఁగూర్చికూడఁ దఱచుగఁ జెప్పియున్న ట్లగపడదు. ప్రబంధనిర్మాణమునఁ బరిపూర్ణ స్వేచ్ఛను గవుల కొసఁగిరి. వారిస్వేచ్ఛ కభ్యంతరము కలిగించినయెడల గ్రంథము చిరకాలము ధరణిలో నిలువదేమో, యందువలనఁ దమకు దీర్ఘమగునుత్తమగతి యుండదేమో యను పెద్దభయము వారి కుంటచేతనే వా రట్లాచరించిరి. కవులు సాధారణముగా స్వతంత్రులు. వారిరుచినే వారు మన్నించువారుకాని యొరులరుచిని గణించువారు కారు. మఱి యొకకవితామతము మంచిదని నచ్చఁజెప్పినను మనసున కెక్క నంతతిక్కగలవారు కూడను. తమయుత్సాహముకొఱకుఁగాని తవ్వెఁడుబియ్యపుఁబొట్టకొఱకుఁ గవిత్వము చెప్పినవారు కారు. అదిగాక యెవరిధోరణి వారిదే! తత్త్వమునుబట్టి వచ్చినధార నెవఁడు మార్పఁగలఁడు? కవితకుఁ గవులు వశ్యులని చెప్పిననది యతిశయోక్తి కాదు. మార్చుకొనఁదలఁచినను మాఱఁజాలని కవులు, పూర్ణస్వేచ్ఛను దమప్రభువులు తమకుఁ బ్రసాదించి నప్పు డేల మార్చుకొనఁ బ్రయత్నింతురు? తమరుచి ననుసరించి వ్రాయుఁడని కవులకుఁ బ్రభువు లాజ్ఞాపింపను లేదు. ప్రభు

పోషణమునఁ గట్టువడి కవులు కక్కుఱితివ్రాఁతల వ్రాయను లేదు. గ్రంథవృద్ధికిఁ దోడుపడినప్రభువులను నిందింపవలసిన పని లేదని" మఱియొకరు ప్రత్యుత్తర మిచ్చిరి.

"అట్లయిన నాకాలపుజనులకవితాభిరుచినిబట్టి కవు లట్లు వ్రాసియుండి రేమో" యని మొదటివారే శంకించిరి.

"అదియును గాదు. అచ్చుయంత్రములు లేనికాలములో కాక మిక్కిలి యరుదగుకాలములో సంవత్సరములకొలఁదిఁ గవుల నాశ్రయించి వారియిండ్ల నివసించి తాళపత్రగ్రంథములకు నకళ్లను జనులు వ్రాసికొనవలసినదినములలోఁ బుస్తకములు కఱవగుదినములలో జనులకవితాభిరుచి యేమి? ప్రభుకవితాభిరుచి యనుమాత్రమైనఁ గారణ మగునేమోకాని ప్రజాకవితాభిరుచి యేమాత్రమును గాదు. కవులే తమయిష్టానుసారముగఁ దమయభిరుచి ననుసరించి యట్లు వ్రాసినారు. వారి సారస్వతములో నౌదార్యము లేకపోవుటయే నిజమగునెడల నట్టిలోపము కవులదని చెప్పవలయును. అదిగాక వారికాలపు సారస్వతమంతయు నుదారాభిప్రాయశూన్యమని కూడ నిస్సందేహముగఁ జెప్ప వీలు లేదు. సారస్వతప్రపంచ ముదారత్వమును మఱచినదను మనమిత్రులమాట దేనికైనను జెల్లినయెడల నీ తరువాతిప్రబంధకర్తలప్రబంధములలోఁ గొలఁదిసంఖ్యకుఁ జెల్లవచ్చును. కాని యాకవులు గతించినారు. ఆప్రభువులు గతించినారు. ఇది యొకక్రొత్తశకము. పరిశుద్ధాంధ్రశారదా

స్థితిని మాసామాజికులలో నొక్క రగుబ్రహ్మశ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగా రాంధ్రపరిషత్పత్రికలో నిట్లు వ్రాసిరి. దాని నిట నుదాహరింతుము.

"నలుబది యేఁబదిసంవత్సరములనుండి మఱింతనీరోగ స్థితిచే విరాజిల్లుచున్నదే. దేహదార్ఢ్యము కలిగి హృదయో ల్లాసము కలిగి చకచకలాడుచు నెక్కడఁ జూచినఁ దానయై ప్రకాశించుచున్నది కదా! మునుపటితట్టురాగిడులతో బుట్ట కొప్పులతో వెఱ్ఱిగ సింగారించుకొనుట మాని నూతననాగరకత కర్హము లైనయొకటిరెండుభూషణములు మాత్రమే ధరించి ముసిముసినగవులమిసమిసలతో బుగ్గగులాబులబుగబుగలతోఁ గన్నులపండువు సేయుచున్నదే! ప్రస్తుతకాలానుసారముగఁ బ్రస్తుతజనచిత్తరంజకముగఁ బ్రాచీనబడబడాయమాన శబ్దా డంబరములు, సందిగ్ధసంభాషణములు, వివిధాభిప్రాయప్రకాశక వచోవైఖరులు నాంతరంగకాఠిన్యమును వదలుకొని పువ్వుల వలె నవ్వులవలె మృదులము లైన లలితము లైనముద్దుముద్దుఁ బలుకులతో, స్పష్టము లైన స్వచ్ఛము లైన, దాఁపఱికము లేని విడివిడిపలుకులతో—నేకాభిప్రాయబోధకము లగుటక్కుటక్కు మనుమాటిపలుకులతో—ననఁటిపండొలిచిచేతఁ బెట్టినట్లు కులు కుచుఁ గులుకుచుఁ బలుకుచున్నది కదా! కొందఱను దనచుట్టు గూర్చుండఁబెట్టికొని వారికిఁ జిత్రచిత్రకల్పనలుగలస్వకపోల కల్పితకథలను—నేవేని పరభాషాకథలను—సరసముగ, సమం

జసముగ, సందర్భముగఁ జెప్పి హృదయరంజన మొనర్చు చున్నదే! మఱియొకచోట నాటకరంగములఁ జేరి బంగరు గజ్జెలు గట్టుకొని తాండవమాడుచు దర్శిష్టలనుగూడ తెయి తక్క లాడించుచున్నదే! మునుపటిలెక్క మునుపటిబిగింపు మునుపటి "నన్నుముట్టుకొనకుఁడనము" విడిచి యాంగ్లేయ భాషలోనున్నప్రకృత్యాదిశాస్త్రములలోనివిలువగలపదార్థముల నొడిలోవైచి తెచ్చి మనకుఁ గానంతకానంతగ గోరుముద్దల క్రిందఁ బెట్టి నోరూరఁజేయుచున్నదే—ఎక్కడఁ జూచిన దానవైు, సభాముఖముల నీతినిగూర్చి, రాజభక్తినిగూర్చి, తన సేవనుగూర్చి, సింహఘోషమున నుపన్యసించుచున్నదే! లోక వార్తాబోధనమున జనులకు లౌకికజ్ఞానసంపద నీయఁదలఁచి యిటు బ్రహ్మపురముమొదలుకొని యటు బొంబాయివఱకు నొక్కటే మోతగఁ బ్రతిధ్వను లిచ్చునట్లు పలుకుచున్నది కదా—"

ఇప్పటివఱ కింతయేచాలును. నరసింహరావుపంతులు గారు కవిత్వము చెప్పనలవా టున్నవా రగుటచే దీనిలో స్వల్పముగ నతిశయోక్తి యుండునేమోకాని యిప్పటికవిత చాలమట్టునకు భావప్రధాన మైనదనియే మనము నిశ్చయముగఁ జెప్పవచ్చును. ఇప్పటివారియభిప్రాయము లుదారముగ లేవని మామిత్రు లధిక్షేపింపవచ్చును. లేవనికూడ నొక్కచేతుదుపుగఁ జెప్పవీలులేదు. కొందఱవారితలలో నుండవచ్చును. మఱి

కొందఱు వ్రాతలలో లేకపోవచ్చును. కాని యభిప్రాయౌదార్య ముండవలయుననియే యందఱు వ్రాయుచున్నారనుట స్పష్టము. పూర్వపువ్రాతలలోనైన నన్నివ్రాతలలో నదియున్నదని మనము నిర్ధారణము సేయఁగలమా? అది కవులఁబట్టియుండును గాని కాలమునుబట్టి యుండునా? తలలఁబట్టి యుండును గాని కలములఁబట్టి యుండునా? మొత్తముమీఁద శబ్దశక్తి మస్తమించినది. భావశక్తి ముదయించినది. ఇంకను మంచువిడినది కాదేమి వేఁడిమి బాగుగఁ బుట్టినది కాదేమి యని తొందరపడుట న్యాయమా? నాల్గుగడియలప్రొద్దెక్కనిండు. దీనిపస గనఁబడును. పర్యవసానమునఁ జెప్పునదేమనఁగ నీశకమందలి సారస్వత మభిప్రాయౌదార్యమును మనసునఁ బూర్ణముగ నుంచుకొనియున్నది కాని దాని మఱచినదిమాత్ర మెంతమాత్రము కాదు. కావున మామిత్రులు సెలవిచ్చిన "సారస్వత ప్రపంచము" నుండి యిది కూడఁ దీసివేయఁబడవలయును. వీరి సారస్వతప్రపంచమునుండి యిది మూఁడవతీసివేఁత. ఈయఱుగుఁ దీఁతలతోఁ దాటికాయ యంతవస్తువు తాడికాయయంతయైనది. కావలసిన దెంతయో మొదటనే చూచుకొనరాదా? అంతయే చెప్పరాదా? గొంతు దిగనిమాత్రను మ్రింగఁబూనుటెందులకు? బాలురు గోలికాయలతో నాడుకొనుచుండ మనకవి కొండలతో నాడుకొనుచున్నారని చెప్పుదురు కాఁబోలు. ఆంధ్ర సారస్వతములో నేదియో స్వల్పభాగము భావౌదార్యరహితమై

యుండ సారస్వతప్రపంచమునంతను దిట్టుట న్యాయమా? గ్రామప్రజలలో నొక్కని దిట్టఁదలఁచి గ్రామములోఁ గలుగు శివకేశవులతోఁగూడఁ జెడఁదిట్టువారెట్టివారో? వార్తలోని పెంటకు నిప్పంటింపఁదలఁచి యింటికప్పు నంటించువా రెట్టివారో? భూషించునప్పుడు పదుగురుజనులతోఁ బాటు మఱి యిద్దఱను జేర్పవచ్చునుగాని తిట్టునప్పుడుమాత్రము పదుగురితో బదునొకండవవానిని జేర్చినయెడలఁ బ్రమాద మున్నదికాదా? ఇట్టియనుచితకార్య మొనర్చుట వీరి కిది ప్రథమప్రయోగము కాదు. కొందఱుపండితులఁ దిట్టఁదలఁచి పండితలోకమునంతను 'ముందుమాట' లోఁ దొందరమాట లాడినారు. 'ఆంగ్ల సాహిత్యముతో పరిచయము కలతదితరులకున్నూఉపయోగించే నిమిత్తము' వీరు వ్రాసినయీవ్రాతలు ప్రజాబాధకములుగ నున్నవికాని ప్రజాబోధకములుగ లేవని చెప్పుటకై విచారించుచున్నాము.

సరే! ఏదో యొకసారస్వత ముదారతను వెలిబుచ్చినది. అట్లదిమఱచుటచేత 'సరసత' యేదో 'నీరసత' యేదో చూపుటకై యొకసరసమైనగద్యకావ్యము నేను రచియింతునని మామిత్రులు మిగిలినరెండుపాదములలోఁ జెప్పినారు. అనఁగాఁ దాను రచియించుసరస మగుగద్యకావ్యమును జదివి 'సరసత' యేదో 'నీరసత' యేదో గ్రహించి; యందువలనఁ గలుగు జ్ఞానముచే గ్రంథములను జనులు వ్రాయునెడల [illegible]

కలుగఁబోవుసారస్వత మైనను మఱచిపోయినయౌదార్యమును జ్ఞప్తికిఁ దెచ్చికొని దానిని గ్రంథములందుఁ జూపించును. ఇట్టి యభిప్రాయమునే యుపోద్ఘాతమున “ఈధర్మములనుమనసులో పెట్టుకొని క్రొత్త గ్రంథములు తెలుగులో వ్రాసేవారు తెలుగు వారికి మహోపకారము చేసినవా రగుదురు.” అని మా మిత్రులు వెల్లడించినారు. ఆంధ్రసారస్వతలోక మౌదార్యమును జూపుటకు వీరిగ్రంథమే తరువాయిగ నున్నదని వీరియాశయ ము. ఈమాట లెట్టివో మాపాఠకులు గ్రహించుకొనవలసినదే కాని మేము చెప్పవలసిన దేమున్నది? ఇదివఱ కుపోద్ఘాతము లోని ‘సరసత’ ను ‘నీరసత’ ను జూచినాము. ఇప్పుడు కృతి పద్యములలోని ‘సరసత’ ను ‘నీరసత’ ను జూచుచున్నాము. ఇఁక ముందు ‘సరస మగు’ నీగద్యకావ్యములోనివి చూడనై యున్నాము. “ఆపదితోషాద్విదుషాం &c.,” అనుశ్లోకమును వీరు జ్ఞప్తికిఁ దెచ్చుకొన్న బాగుగ నుండును. ఇఁక నీపద్య విమర్శనమును గట్టిపెట్టి ముందుపద్యమునకుఁ బోవుదము.

“అవధారు లక్ష్మణార్యా!
పరిచితశ్రుతిస్మృతిపురాణపుణ్యచరిత్రా!
విదితజ్యోతిషమర్మా!
విజయపురీపూసపాటిభూపవిధేయా!”

కృతిచతుశ్లోకి కిది తోఁక. పద్యముల కుండఁదగిన మర్యాద లన్నియు భగ్నమగుటచే నిది నిండుఁదోఁక కాదు.

మొండితోఁక. వెనుకటిమూఁడుపద్యములలో నచ్చటచ్చట యతిప్రాసములమర్యాద పాటింపఁబడినది కాని యీపద్యములో యతులు లేవు. ప్రాసములు లేవు. గణనియమము లేదు. పోనీ! వచన మందుమా? అది కాదు. ఇది యేదైనట్లు? నాడి లేదు. వేఁడి లేదు. చలనము లేదు. అంత్యావస్థ కాదు. ఏదో చెప్పఁడి! మాలో నొక్కరు రవ్వంతయాశుధారాకవితను జెప్పఁగలవా రున్నారు. ఆయన యీదిగువపద్యమును గొంచెము నట్టుకొనుచుఁ జదివెను.

"బుధులు నుతియించుయతులను ♦ బాడిచె నేది?
శేముషిని బ్రాసములను భం ♦ జించు నేది
కడకు గణమైన లేనిభా ♦ గవత మేది
మూఁడుకాళ్లకుఁ దలయేదొ ♦ చూడు పైకి."

ఈపద్యమును జదివి యీకట్టుకథను భేదింపుఁడని పలికెను. అయిదునిముసములవఱకు మిగిలినవా రాలోచించుచు మిన్నకుండిరి. తుదకు వారిలో నొక్కరు కిటుకు దొరకినదని చిటుక వైచిరి. "మూఁడుకాళ్లనఁగ మూఁడుపాదములు. వాని మొద లనఁగ మొదటియక్షరములు. అవి 'బు—శే—క' అయి యున్నవి. యతిప్రాసగణశూన్య మైనది 'బు. శే. క.' అనఁగా బుఱ్ఱా శేషగిరిరావుగారికవిత్వము" అని చెప్పెను. ఈయర్థము స్ఫురింపనిముప్వురుకూడఁ బద్యము బాగుగ లేదనియు గూఢముగ నున్నదనియుఁ బంచాయితికవి నధిక్షేపించిరి.

"బాగుగ లేకపోయినఁ బోనిండు. పద్యమైన నిది యగును. అదియుఁగూడఁ గానివట్టి పెంటకంటె నయము కాదా?" యని యాతఁడు ప్రత్యుత్తర మిచ్చెను.

'అవధారు' అనఁగఁ జిత్తగింపుము. ఇది యసాధారణ శబ్దము. ఇది వాడుకలో నున్నది కాదు. విశేషముగ గ్రంథస్థ మగుశబ్దముకూడఁ గాదు. ఆంధ్రకవులు రమారమిగ నందఱు నిట్టిసమయమున "నవధరింపుము" ని వ్రాసియున్నారు కాని 'యవధారు' అని వ్రాసి యుండలేదు.

లక్ష్మణార్యునకు నాల్గువిశేషణము లీపద్యమున నుప యోగింపఁబడినవి. మొదటిది "పరిచితశ్రుతిస్మృతిపురాణ" ఇది మిగుల సొగసగువిశేషణము. అత్యద్భుతస్వభావము కలది. ఇది సరిగాఁ జదివినయెడలఁ దప్పు. తప్పుగాఁ జదివినయెడల సరి. లక్షణయుక్తముగాఁ జదువునెడల లక్షణభంగము. విలక్షణముగాఁ జదివినయెడల సలక్షణము. దీనిని బండితు లొప్పుగాఁ జదువవలయునా? తప్పుగాఁ జదువవలయునా? శబ్ద జాలములో నిది రెండుతలలపామువలె నున్నది. ఏవైపు తలయో నిర్ధారణము సేయు టెట్లు? ఏలక్షణమును బాటింప వలయునో యెవరి కెఱుక? శబ్దలక్షణమునుబట్టి పలుకవలసిన యెడల గణలక్షణము ధ్వంసమగును. గణలక్షణమునుబట్టి పలుకవలసినయెడల శబ్దలక్షణము ధ్వంస మగును. మాలో నొక వైయాకరణులు దీనిని యథావిధిగా—నసఁగ "బరిచిత"

లో "త" వర్ణమును 'శ్రుతి' లోని "తి" వర్ణమును గురువు లగు నట్లుపలుకఁగ "నయ్యయ్యో! కందము గాడిదవాలక మైనద" ని యడ్డుపెట్టిరి. పాణిని భ్రష్టుఁడగుటకంటె మేలుకాదాయని వారు ప్రత్యుత్తర మిచ్చిరి. సంయుక్తాక్షరసమన్వితము లగు నన్నిసమాసములవలె నిది యూఁదిపలుకఁదగినది కాదు. వదలుగాఁ బలుకఁదగినది. అంతట మాలో నొకరు కందమును గాపాడుటకై పుస-పుస, తుసు-తుసు, సమరవసంప్రదాయమున జదువనారంభించి రవంత బోసినోటిసందర్భముచేఁ జదువలేక కిచకిచలాడిరి. అందఱునుగూడ నవ్విరి. ఇది సురసురలాడు 'సిసింద్రి' వసందునఁ జదువవలయును. "బాపనపిత్రి" పరిపాకము గలదీనిని గురులఘుమర్యాదతోఁ జదువుడే!

మామిత్రులాంధ్రులు. ఆంధ్రభాషాజ్ఞానముకలవారు. ఆంధ్రగ్రంథములు వ్రాయుచున్నారు. ఆంధ్రులయుపయోగమునకై వ్రాయుచున్నారు. కొన్నినాటకములుగూడ వ్రాసినట్లు వినుచున్నాము. ఆంధ్రవ్యాకరణమును హతము చేయసంకల్పించుకొనినారు. అట్టివీరు సంస్కృతశబ్దమర్యాదలకుఁగూడ నిప్పంటించు టెందులకు? పని లేకయా? పట్టుదలనా? పండితులు మమ్మేమిచేయఁగలరనునిర్భయమునచనా? భాషాసంస్కారమునకు మేమే యర్హుల మనుతలతిరుగుడుచేతనా? పెద్ద లెవ్వరయిన వినిన నవ్వుదురేమో యనుసందేహమైన లేకపోవుటచేతనా? మనకంటెఁ బెద్ద లెవ రనుకొనవెఱ్ఱిచేతనా? ఎందులకిట్లువ్రాయ

వలయును? తోcచకపోయినప్పుడు చేసికొనుట కెన్నిపనులు లేవు? కళావరురాణిని నేల నడcగcగొట్టవచ్చునే! గ్రాంథికవాణి నిట్లు తలపగులcగొట్టినcగాని కాలము గడవదా? మనవ్యాకరణమును మట్టిలోc గలిపి, మనపద్యమర్యాదను మంటcబెట్టిరి. ఇది చాలదా? పరమపవిత్రగీర్వాణభాషాశబ్దభవనమునకుc గూడ నాల్గుచూరు లంటించి పరశురామప్రీతి చేయుపాపముకూడ నేల? ఇప్పుడు కాదు. ఈపద్యవిమర్శన మైనపిదప నీనియమ శూన్యతcగూర్చి సంక్షేపముగ ముచ్చటింతము. ఈసమాసము చే మామిత్రులు గణనియమమును దోసిపైచినారు. యతి ప్రాసముల నిదివఱకుc ద్రోసిరా జనలేదా? దానికిc దోడిది.

"పరిచితశ్రుతిస్మృతిపురాణ" యని శిష్టు లగుతండ్రిగారి కిది సంబోధనము. శ్రుతిస్మృతిపురాణములందు వీరికిcబరిచయము కలదనిమాత్రమే మామిత్రులు వ్రాసినారు. శ్రుతిస్మృతి పురాణములు విధ్యుక్తముగా వీ రధ్యయనముచేసి లోcతైన జ్ఞానమును సంపాదింపలేదని "పరిచిత" శబ్దమే చెప్పుచున్నది. వా రధ్యయనము చేసియుండినట్లయిన "నధీత" శబ్దమే యుపయోగించి యుందురు. ప్రాసనియమమును వదలుకొని నప్పుడు బాధ యే మున్నది? పరిచయ మనcగా గలcతకొట్టు జ్ఞానము, పిట్టతలపాండిత్య మని యర్థముకాని విశేషజ్ఞానమని యర్థము లేదని మాలో నొకరు చెప్పిరి. ఇట్టి "గాదిలిపట్టి" యే తండ్రిగారిజ్ఞానమును "బరిచయ" మని సెలవిచ్చినప్పుడు

మనము దాని నెంతమట్టునకు గ్రహింపవలయునో ? కాని మొదటిపద్యములో “ఆంధ్రపురాణకథావినోదముల్ మోదము తోడ జోలలుగ ముచ్చట బాడి” యనితండ్రిగారినిగూర్చి వీరు వ్రాసిరి కాదా? ఆంధ్రపురాణగాథలు వాగ్వైధేయములై పాటలక్రిందఁగూడఁ బరిణమించినవని వీరిపురాణజ్ఞానము నచ్చట నధికముగా వర్ణించి, యిచ్చటఁ బురాణపరిచయము కలవారనిమాత్రమే చెప్పినారేమో? శ్రుతిస్మృతులను దీసిపాఱ వైచిననైనను వీరిపురాణజ్ఞానమైన పైమాటప్రకారమధికమా? అడుగుమాటప్రకారము సామాన్యమా? మామిత్రులయా వాక్యము నిజమా? ఈవాక్యమునిజమా? “ఆదిని శైశవంబుననె” కేవలము మనమిత్రులు తెలియనిస్థితిలోఁ గాని తెలిసియుఁ దెలియనిస్థితిలోఁగాని యుండుటచేతను దండ్రిగారు పాటకు నోరు తెఱచుట యాయననిద్రకుఁ గన్నుమూయుట రమారమిగ నొక్కకాలమందే సిద్ధించుటచేతను వారిపాండిత్య మధికమని యనుకొనినారేమో? ఏమో యనవలసినదే కాని యిదమిత్థమ్మని చెప్పుట యెవ్వనితర మగును? ఒకనియమము, సందర్భము, పద్ధతి, యున్నయెడల నర్థము స్పష్టమగును గాని తలవెంట్రుకల చిక్కునకుఁ దుదమొద లెట్లు తెలియును?

తరువాత “పుణ్యచరిత్రా” యనుసంబోధనము. అర్థము స్పష్టము. మాలో నొక్కరు “అతఏవ” అని దీనికిఁ బూర్వమున నధ్యాహారమును జేసికొనవలయునని చెప్పినారు. “పరిచితశ్రుతి

స్మృతిపురాణులు కావుననే “పుణ్యచరిత్రులు” నియభిప్రాయము. అట్లు చేసికొన్నను మంచిదే! చేసికొనకున్నను మంచిదే! “పరిచిత” శబ్దమును “పుణ్యచరిత్రా” యనుదానితోఁ గూడ నన్వయించి పరిచిత మగుపుణ్యాత్ములచరిత్రములు గలవారని యర్థము సిద్ధించునట్లుగా నేకసమాసము చేసినఁ జేయవచ్చునని మాలో నొక్కరనిరి. అట్లుచేయుట సొగసుగ నుండదని వే ఱొకరు చెప్పిరి. సొగసునకై యిచ్చటకు రానేలయనిమొదటివారు పలికిరి. “విదితజ్యౌతిషమర్మ!” యనునది యనంతర సంబోధనము. జ్యౌతిషశాస్త్రమర్మము లెఱిఁగినవారనియర్థము. ఈశాస్త్రమును వీరితండ్రిగారు బాగుగ నధ్యయనము చేసినట్లు స్పష్టము. అత్యంతాధ్యయనమునఁగాని యాంతరరహస్యములు చిక్కవు.

“విజయపురీపూసపాటిభూపవిధేయా!” యనునదియంత్య సంబోధనము. వీరితండ్రిగారు విజయనగరపుఁబూసపాటిమహా రాజుగారిపోషణమున నుండువారని దీనివలన స్పష్టము. మహా రాజవిధేయతయనుగుణము వీరి కున్నదని మామిత్రులు సెల విచ్చుచున్నారు. అదిగాక యిది మహోత్కృష్టగుణముగా నెంచి దీనిని మనమిత్రులు పద్యాగ్రమునఁ జెప్పినారు. రాజ విధేయత మంచిదే యగును. కాని యాగుణమునకై భృత్యుని మాత్రము పొగడవలసినపని లేదు. ప్రధానుఁడు మొదలు బానిసవఱకు రాజున కందఱు విధేయులే. పనులలో భేద

ముండవచ్చును. ప్రీతిఫలములలో భేద ముండవచ్చును; గాని ప్రభువిధేయతలో మాత్ర మొకని కొకనికి భేద మెంతమాత్రమును లేదు. విధేయతకలవారు కావుననే వీ రందఱు ప్రభుని కోటలోనుండఁగలిగిరికాని యదిలేనియెడల వీథిలోనుండవలసిన వారే కారా? రాజునెడల విధేయతలో వెనుకదుగువదుటయేమి? రాజద్వారమున భృత్యునకుముందడుగు పడకపోవుట యేమి? అవి రెండును యుగపద్భవములే. జీవనోపాధి పోవునను భయము చేతనో, పొలములకు నీ రీయరనుచింత చేతనో, పిల్లలకు బ్రదుకుఁదెరు వుండదనుభయముచేతనో, రాజాగ్రహపాత్రుని జనులు లఘువుగఁ జూతు రనుసందేహము చేతనో, రాజదయాపాత్రులుగ నున్నయెడల నెప్పటికైనను లాభించు ననునాశచేతనో, బలవంతులతోఁ బట్టెందుల కనునూహముచేతనో, మఱెందులకో యెల్లజనులు—రాజగ్రామమున నున్నయెల్లజనులు—కేవల భృత్యులైన సరే కానివారైన సరే రాజాజ్ఞకు విధేయులై యుండక తీఱదు. అది నిర్బంధమే! తప్పనిసరియే. మామామ Central jail లో నున్నయేడుసంవత్సరములుగూడ స్త్రీమొగమెఱుఁగఁడని చెప్పినయెడలఁ గారాబద్ధున కిది యేమి ఘనతయా? పంతులుగారు ప్రార్థనామందిరములోఁ గూరుచుండినంత సేపును జుట్టు గాల్పరని చెప్పినయెడలఁ బంతులుగారి కదిగౌరవకారణమా? పితృవిధేయత చూపనివాఁడైనను రాజవిధేయతను జూపక తప్పదు. అవిధేయుఁడగుపుత్త్రుని దండ్రి దండించునా?

ఇంటినుండి తఱిమివేయునా? జీవనాధారభంగము సేయఁ గలఁడా? ఆస్తికి భాగస్వామి కాఁడని బహిష్కరింపఁగలఁడా? నోటికసిదీఱఁ దిట్టినను దిట్టఁగలఁడా? మనస్సులో నైనఁ గోప తీవ్రత నందఁగలఁడా? అతఁడు చెడిపోవలయునని స్వప్నమందైనఁ గోరుకొనునా? అవిధేయుఁడైనను సరే, అసన్మార్గుఁడైన సరే; ఎక్కడనైనఁ బ్రదికి బాగుపడవలయుననియే కోరుకొనును గాదా? తిట్టినకొడుకులను దీవించినతండ్రు లెందఱు! అట్టితండ్రి యెడల విధేయుఁడై యుండుటవంటిదా రాజునెడల విధేయుఁడై యుండుట? తండ్రియెడల విధేయుఁడై యుండనియెడల రాఁదగినప్రస్తుతప్రత్యవాయ మేమియు లేదు. కాని రాజునెడల నవిధేయత యట్టిదా? భృత్యునినోటిచివర కవిధేయపుమాట వచ్చునరికి రాజుకలముచివరకు జీవనహానిమాట రాదా? పితృవిధేయత సద్గుణము. రాజవిధేయత సద్విధి. చేసినయెడల ఘనత గల్గుకార్యములకుఁ జేయకపోయినయెడల బాధవచ్చు కార్యములకు భేదము లేదా?

దైవవిధేయతకంటె నుత్తమగుణ మింట లేదు కదా? అది లేనివాఁడైనను రాజవిధేయుఁడు కాక తప్పదు. నిత్యప్రార్థన మింటియొద్దఁ జేయనివానికిఁ బ్రస్తుతశిక్ష యేమున్నది? సంఘప్రార్థనము దైవప్రార్థనమును జేయనివానికిఁ బ్రకృతదండన మే మున్నది? చేసినవాఁడు చెడియుఁ బోవుచున్నాఁడు; చేయనివాఁడు వృద్ధిపొందుచుఁ గూడ నున్నాఁడు. పరలోకమునఁ

గాని యాపనులవస తెలియదు. అంతదూరదృష్టిగలవా రెంద ఱున్నారు? నూటికిఁ దొంబదుగు "రెదుటఁ బడినసుఖమును జూచుకొందము; ముందుమాట దేవుఁడెఱుఁగునని" యనువారే కారా? రాజవిధేయత యట్టిదా? ముందుసంవత్సరముఃవఱకుఁ గాని, ముందుదినమువఱకుఁ గానియెందులకు? అవిధేయవాక్య ఫల మప్పుడే కనఁబడును గాదా? భృత్యుఁడు తల నడ్డముగ నూఁపుట యేమి, రా జతనిపేరుపై నడ్డముగ గీఁత పెట్టుట యేమి. భృత్యుఁడు రాజుమాట కడ్డము చెప్పుటయేమి? రాజు భృత్యునకు 'దేవిడిమనా' చెప్పుట యేమి?

ఇన్ని యేల "పాణిని" కంటె "మెకాలే" యెక్కువవాఁడు కాఁడు కదా? "మెకాలే" వ్రాసినశిక్షాశాసనము నందు మా మిత్రుల కంత యాదర మేమి? పాణినివ్రాసినశిక్షాశాసనమం దింత యనాదరణ మేమి? దానిని వ్యతిరేకించి Nuisance నేర మైనఁ జేయుటకు జంకేమి? దీనిని వ్యతిరేకించి 'విమర్శాదర్శ' వంటి పెక్కుతప్పులను బుద్ధిపూర్వకముగఁ జేయుటకు జంకు లేకపోవుట యేమి? ఏ మున్నది? పరీక్షోద్యోగులవలన నందుల కై బాధ యున్నది. పండితులవలన నిందులకై భయమైన లేదు. Penal code ను మీఱకపోవుటలో మామిత్రులకు గొప్ప యేమియు లేదు. పాణినిని మీఱకపోవుటలోఁ బ్రయోజ కత యున్నది. చేయకపోయినందువలన బాధవచ్చుపనులఁ జేసినందువలన ఘనత యెంతమాత్రమును లేదు. అట్టిపనులు

చేసినందులకు మాత్రము మనుజునిస్తుతింపఁ దగదు. "బిడ్డలఁ బోషించునట్టిపితృశేఖరుఁడా!" యని యొకనిని స్తుతింపనక్కఱ లేదు. చేసినయెడల గౌరవమే కాని చేయకుండినయెడలఁ దప్పు లేనిపనులఁ జేసినవాఁడు స్తుత్యర్హుఁడు. "దిక్కుమాను దెసయును గలుగని పెక్కురుబిడ్డలను బ్రోచుప్రేమాంబునిధీ!" యని నుతియింపఁదగినమహాపురుషుని నుతియించుటవలన లోకము మెచ్చును. లోకనాథుఁడు మెచ్చును. అంతే కాని "కరణము భగవంతయ! కలకటరువిధేయా!" యనికుంటికాలి కవిత్వముతో "గులకర్ణిని" గొనియాడుట ప్రజ్ఞాలక్షణమా? ప్రపంచజ్ఞానలక్షణమా? కవిత్వలక్షణమా? ఈకవిత్వమును విని కలక్టరు గాదు, జనులు గాదు, గ్రంథనాథుఁడైనకరణమైన మెచ్చుకొనునా? "విజయపురీపూసపాటిభూపవిధేయా!" అనునది యట్టిపాదమే కాదా! ఇన్నిపరీక్షలలోఁ గృతార్థులై యీ మాత్రపుటున్నతస్థితిలో నున్నవీరు "Virtue" యేదో "Duty" యేదో యెఱుఁగకపోయి రని చెప్పవలసివచ్చినందులకు విచార పడుచున్నాము. ఇట్టిస్వల్పాంశమును గూర్చి యింతసేపు పలుక వలసివచ్చినందులకు లజ్జ పడుచున్నాము.

అంత మాలో నొక రిట్లుపలికిరి. విజయపుర్యాది సమాసమునకు మనమిత్రు లుద్దేశించినయర్థము వేఱని నేనను కొందును. పూసపాటిరాజుగారి కీయన తండ్రిగారు విధేయుఁ డనియర్థము కాదు. "పూసపాటిరాజువిధేయుఁ డెవనికో

యట్టివాఁడ" ని సమానసమన్వయమును మనమిత్రులు చేయుదు రనుకొందును. అందువలనఁ బూసపాటిమహారాజగారే లచ్చన్నగారికి విధేయులని యర్థము చెప్పవలసియున్నది. సొపుగ నున్న సరళముగ నున్న సర్వత్రసామాన్య మైన యర్థమును బరిత్యజించి తిరుగుడుగ నున్న క్లిష్టము నగు యసాధారణ మైనయీయర్థమును బరిగ్రహించుట తగదని మఱియొకరు పూర్వపక్ష మొనర్చిరి. అదిగాక వ్యాకరణ మర్యాదచే నీవిపరీతార్థము సిద్ధమైనను బ్రకృతివ్యాసచే సిద్ధమెంతమాత్రము కాదు. శబ్దశక్తి యొప్పుకొనినంతమాత్ర మున సహజవిరుద్ధార్థము సాధింపఁ దగదు. కొహళులకు నున్నతత్పురుషసమాసమునే వా రుద్దేశించి యుందురుగాని, పండితసాధ్య మైనయీబహువ్రీహిసమాసము 'వారితల కెక్కి యుండదు; "గురువిధేయా" యని శిష్యునిగూర్చి పలుకునప్పుడు "గురుఁడు విధేయుఁడుగాఁ గలశిష్యుఁడా" యని యర్థము చెప్పుట యసమంజసము. శబ్దప్రపంచమున నొప్పయినను భౌతిక ప్రపంచమునఁ దప్పు. అదిగాక సూత్రముపట్టినట్లు సూటి యగునర్థము కనఁబడుచుండ సందుగొందులలో నివంకరటింకర యర్థమును గ్రహింప నేల? 'దేవవిధేయ' యనఁగా దేవుఁడే విధేయుఁడుగాఁ గలవాఁడని చెప్పుట యెట్లుండును? తప్పు లేనప్పు డేల చెప్పఁగూడ దందురేమో? అర్థములకొఱకు శబ్ద ప్రయోగములు కాని శబ్దప్రయోగములను బట్టి యర్థములు

కావు. ఇట్టిప్రయోగములు లేవా యని శంకింతు రేమో? లే కేమి? బహువిరళముగ నున్నవి. పండితశిఖామణులు చేసినవి. ‘‘అనుత్తమము.’’ అని వాల్మీకిప్రయోగ మున్నది. దాని నిప్పటివా రుపయోగించునెడల మధ్యమమో, యధమమో యని యర్థమును జెప్పుదురు. వాల్మీకిమాత్రము సాధారణార్థమున దానిఁ బ్రయోగించి యుండలేదు. ‘‘దేనికంటె నుత్తమము లేదో’’ అది యనుత్తమమని యామహర్షి యభిప్రాయము. అత్యుత్తమ మని యర్థము. ఆయర్థమున మన మిప్పు డా శబ్దమును బ్రయోగించునెడల హాస్యాస్పదముగ నుండును. ఇట్టిప్రయోగములే యచ్చటచ్చట కొలఁదిసంఖ్యగలవి యై యున్నవి. అట్టిప్రయోగములలో నిది కూడ నొక్కటి యేల కాఁగూడదని శంకింతు రేమో? నిరభ్యంతరముగఁ గావచ్చును. భూపునకు భృత్యుఁడు విధేయుఁడుగ నుండుట లోకాచారము. వస్తుతత్త్వమున భూపుఁడు భృత్యుఁడు నొక్కటే. ఆజ్ఞాపకుఁ డాయన. ఆజ్ఞప్తులము మనము. ఆజ్ఞలిచ్చువాఁడు కావుననే యాతఁడు భూపుఁ డయ్యెను. వానిని గ్రహించువారము కావుననే మనము భృత్యుల మైతిమి. విధేయతను జూపువారు భృత్యులు. విధేయతను గ్రహించువాఁడు భూపుఁడు. ఈసరళ మైనయర్థమునే మనమిత్రులు ‘‘విజయపురీపూసపాటిభూపవిధే యా’’ యని సమాసమున సమకూర్చిరి. ఇది సర్వజనసమ్మత మైనసహజార్థము. భూపవిధేయత విధికాని సుగుణసంపత్తియు

స్తుతిపాత్రస్థానము కాదని యీయర్థమును మేము వెనుక నధి క్షేపించితిమి. కాని యది పరమార్థమైనయర్థము కాదని మేము దానిని నిరాకరించి యుండలేదు. కరతలామలకమువలెఁ గన్నులఁ గట్టిన ట్లున్నయీయర్థమును నిరాకరించి వఱియొక యర్థమును స్వీకరింపఁ దలఁచినయెడల ద్వితీయార్థము ప్రథమార్థముకంటె సరసముగను స్పష్టముగను, సహేతుకముగను, సహజముగ నుండవలసినదే కద! అట్లే కాకుండునెడలఁ బూర్వార్థమును బూర్వపక్షమును జేయుబుద్ధి యేలకలుగ వలయును? రాజే భృత్యునకు విధేయుఁడుగ నున్నాఁ డనఁగ సరసముగ నున్నదా? శ్రవణకఠోరముగ నున్నది కాదా? స్పష్టముగ నున్నదా? క్లిష్టముగ నుండ లేదా? సహేతుకముగ నున్నదా? నిరంకుశముగ నుండలేదా? సహజముగ నున్నదా? లోకవిరుద్ధముగ లేదా? ఇట్లు చెప్పుటవలన భృత్యున కేమైన ఘనతయున్నదని కవి యూహించియుండునా? రాజునాధిక్యము తగ్గించుటదక్క నంతకంటె. నీయర్థమునకు వినియోగ మే మున్నది?" ఇట్టిప్రయోగమును జేసినకవిపై రాజున కెట్టి యంతఃకరణవృత్తి యుండును?

భర్తల నేలుచాకచక్యముగలవనితలు కొందఱున్నారు. వారైనను భర్తమాట కడుగుదాఁటనట్లు కనఁబడుదురు. అట్టి వనితలలో నెవ్వతెనైన "మగనిని జేతిలో బొమ్మవలె నాడించు చున్నావు.నీశక్తి యెంతయో చెప్పవచ్చునా?" యని పొగడింటి

యిట్లా లెవ్వతెయైన స్తుతింప నీయిల్లాలు కన్నులెఱ్ఱగఁజేసి యామెను దూయఁబట్టుకొనదా? మగని నేలుట తప్పని యామె యెఱిఁగియుంటచేతనో, యట్లు లోకు లనుకొనుట తనకు మఱింతతప్పని యనుకొనుటచేతనో, మగఁడు తనకంటికే గంగి గోవుగ నుండవలయునని కాని, యితరు లాతని నక్లించుట తగదని తా ననుకొనుటచేతనో కాని, యామె తిరుగఁబడి స్తుతియించినదానిని దిట్టనారంభించును. మగఁడు మందుఁడను మాట. కాంత గయ్యాళి యన్నమాట. నుతియించి తిట్లుదిన్న తెఱవ తెఱ్ఱనోటి దన్నమాట. అసందర్భ మగునీస్తోత్రమువలన నిందఅపుట్టి మునిఁగినది. కాని రాజభృత్యసంబంధము భర్తృ భార్యాసంబంధము వంటిది కాదే! అవిధేయురా లగుభార్యను భర్త సహించునుగాని యవిధేయుఁ డగుభృత్యుని రా జేల సహించును? అంతేకాక రాజు భృత్యునకు విధేయుఁ డగుట యెన్నఁడును జరుగదు. అది యసహజము. కావున నీయనుచి తార్థము నీవాక్యమునకుఁ జెప్పఁదగదు.

విజయనగరమున నిప్పు డున్నప్రభువునకుఁ బూర్వ ప్రభువు లగుశ్రీమదానందగజపతిమహారాజుగా రనేకభాషా పండితులు. లలితస్వభావులు. గర్వశూన్యులు. మృదుమధుర భాషాప్రియులు. విశేషించి గానకళాకోవిదు లని మనమందఱ మెఱుఁగుదుము. ఆస్థానపండితు లేమి, యితరపండితు లేమి యామహారాజును «పండితప్రభూ!» యని సంబోధించువాడుక

గలదు. ఒకసారి యొకమహావిద్వాంసుఁ డెటనుండియో వచ్చి మహారాజును 'పండితప్రభూ' యని సంబోధించుచునొకశ్లోకమును జెప్పెను. ఆమహారాజాశ్లోకమును విని సంతసించి "పండితప్రభూ" యనుదానిని దత్పురుషసమాసముగఁ జెప్పుటకంటె బహువ్రీహిసమాసముగఁ జెప్పుట యెక్కువరసవంతముగ నుండునని యాపండితవర్యునితో సరసముగఁ బలికెనఁట! చూచితిరా! ఆయనరసజ్ఞత. గర్వశూన్యత. మాకుఁ బండితులే ప్రభువు లని యాయన చమత్కారముగ సెలవిచ్చినారు. ఆమాట యాయననోట వెడలుటచే సంతసాగసుగ నున్నది. ఆమాటను దొరకఁబుచ్చుకొని మాతండ్రిగారికిఁ బూసపాటి ప్రభువులు విధేయు లని యెవ్వరైన ననవచ్చునా? అనుటతో నూరకుండక యట్టివాక్యము నచ్చువేయింపవచ్చునా? ఒకవేళ లక్ష్మణమూర్తిగారు పూసపాటివారికి మతగురువు లేమో, యందుచే నాప్రభు వీయనకు విధేయుఁడని మామిత్రులు చెప్పుచున్నా రేమో యనియనుకొందమన్న వీరుపూసపాటివారి మతగురువు లని మేము వినియుండలేదు. ఒకవేళ వీరు వారికి విద్యాగురువు లేమోయని యనుకొందమన్న యట్టిప్రజ్ఞాప్రదాన పవిత్రానుబంధమును బాహాటముగ, బహిరంగముగఁ జెప్పవలసినది కాని బహువ్రీహిపాము మెలికలలో దూరముగ సూచింపవలసిన యావశ్యకత యేమున్నది? కావున విధేయశబ్దమెటుచూచిన నిరర్థకముగనే కాన్పించుచున్నది.

మాలో నొక్క రీసందర్భమున నొకచిన్నకథను జెప్పిరి. ఆకథ యీవిమర్శమునకు సంబంధించినది కాదు. కాని మే మీవిజయపుర్యాదిసమాసవిమర్శమునఁ బలుమాఱువిధేయశబ్ద ముపయోగించుటచేత వారి కాకథ జ్ఞప్తికివచ్చినదఁట. పుండరీకాక్షుఁడుగా రనునొకసంపన్నగృహస్థుఁ డీ 'జిల్లా' లో వెనుక నుండిరి. ఆయనయొద్ద కొకనీళ్లబ్రాహ్మణుఁడో వంటయాతఁడో పోయి మూర్ఛవలె నట్టె యావేశించినకొనవెఱ్ఱికవిత్వముతో "పుండరీకాక్షనామధేయా! సుజనవిధేయా! నీకొడుకులకు ధేయా! నీకూఁతులకు ధేయా! నీకు ధేయా! నాకు ధేయా!" యని పలికె నఁట. ఈతని 'ధేయ' కు మామిత్రుల 'విధేయ' కు శబ్ద రూపములో "వి" భేదమే కాని యర్థశూన్యతలో విభేదము లేదు.

ఇక్కడకుఁ గృతిపద్యవిమర్శన మైనది. ఈపద్యములఁ గూర్చి సామాన్యముగఁ జెప్పవలసినయంశములను సంకుచితముగఁ జెప్పెదము. వ్యావహారికభాష యెట్లునియమశూన్యమో పండితులప్రయోగము లనివారుచెప్పినవి యెట్టినియమశూన్యములో మామిత్రులపద్యరచన యట్టినియమశూన్య మయి యున్నది. వ్యావహారికభాషలో గ్రంథములు వ్రాయవలయు ననియే మాతూర్పుసోదరులయభిప్రాయ మైయున్నది. అందుచే గద్యగ్రంథములేమి పద్యగ్రంథములేమి వ్యావహారికభాషలో నుండఁదగినవే. అటులే గ్రామ్యవాదులలో నొక్కరగు శ్రీ సెట్టి లక్ష్మీనరసింహముగారు వ్రాసినారు. వీరురచియించిన

బొప్పడుపాటయను "స్త్రా" ప్రాస మున్నచిన్నగ్రంథమును గ్రామ్యమున వ్రాసినారు. కాని మామిత్రులు రచియించిన గద్యగ్రంథమును గ్రామ్యభాషలో వ్రాసి పద్యగ్రంథమును మాత్రము కేవలగ్రాంథికభాషలోనే వ్రాసినారు. పద్యరచనలో నాగ్రామ్యవాదివ్యావహారికభాష నుపయోగింపఁగ నీగ్రామ్యవాది గ్రాంథికభాషనే పట్టుదలగ నేల యుపయోగించెనో! ఈ గృహచ్ఛిద్రమునకుఁ గారణమేమియో తెలియఁజాలకున్నాము. లక్ష్మీనరసింహముగారు పూర్ణగ్రామ్యవాదియు మాగ్రంథకర్త యర్ధగ్రామ్యవాది యై యుందురా? ఈయనపక్షాంతరమున నభివృద్ధిచెంది యాయనవలెఁ బూర్ణు లగుదురా? కాక పరార్ధశూన్యులై యిటులే యుందురా? కాక లక్ష్మీనరసింహముగారు కాలక్రమమున సంకుచితులై మామిత్రులవలె నర్ధగ్రామ్యమునఁ బడుదురా? కాక వారిమట్టునకువారు నెఱసున్నవలె, వీరఱసున్నవలె స్థిరముగ శబ్దప్రపంచమున నుందురా? కాని మొత్తముమీఁద గ్రామ్యభాషాపద్యముల వ్రాసినలక్ష్మీనరసింహముగారికంటె గ్రాంథికభాషాపద్యములను వ్రాసిన మామిత్రులే కొంతశ్లాఘనీయు లని యూహింపవలసి యున్నది. కాని యొకచిక్కు వచ్చినది. గ్రామ్యభాషలో వ్రాసినను బద్యరచన కుండఁదగినగణయతిప్రాసనియమములను లక్ష్మీనరసింహముగారు పాటించిరి. గ్రాంథికభాషలో వ్రాసినను మామిత్రులు కృతిపద్యములలోఁ బద్యనియమమును బాటింప

లేదు. అందులకు సంతసింపమా? ఇందులకు విచారింపమా? ఏగ్రంథము వ్రాసినను వ్యావహారికభాషలోనే వ్రాయఁదగిన దని గ్రామ్యవాదుల యాశయమే కాని యతిప్రాసములభంజించు నుద్దేశము వారికి లేదు. కాని యీగ్రామ్యవాదిగారు పద్యగ్రంథమును మాత్రము గ్రాంథికభాషలోనే వ్రాయఁదగు ననియు వానిని యతిప్రాసనియమశూన్యములుగ వ్రాయవచ్చు ననియు, నూహము కలవారైయున్నారు. కావున మామిత్రులు గ్రాంథికవాదులలో నుండి జాఱినారు. గ్రామ్యవాదులలోఁ జేరలేదు. వీరు వారు కారు. వీరును గారు. వీ రర్థగ్రామ్యార్ధ గ్రాంథికగణవిభంజకగణములోనివారుగ నున్నారు. ఇది యిప్పటివఱ కాకృతిగణము కాదు. గణములో నున్నవారుకూడ నొక్కరే!

గ్రాంథికభాషను వదలుకొనుటలోనే గ్రామ్యవాదుల కందఱ కైక్యము కాని మిగిలినయంశములలో నైక్య మున్నట్లగపడదు. వ్యవహారభాషానిర్వచన మిప్పటికిఁ దేలలేదు. ఎవరి యిష్టమువచ్చినట్లు వారు వ్రాయుచున్నారు. కొందఱు పద్య రచనకు మాత్రము వ్యవహారభాష పనికిరా దనుచున్నారు. పనికిరాకపోవుట యేమి? పనికిరానిదానినే పనికివచ్చునట్లు చేసికొనవలయు నని కొంద ఱనుచున్నారు. భాష మార్చినను బద్యలక్షణములను మార్పు చేయఁగూడదని కొందఱుబోధించు చున్నారు. దాని ముద్దేమిముక్కలైనది దానిని గూడఁ

ద్రోసివైవవచ్చునని కొందఱ అనుచున్నారు. మనము ప్రయో గించుచున్నశబ్దములతప్పొప్పులను నిర్ణయించునదేదియని కొందఱ అడుగుచున్నారు. మనచిత్తమే యని కొందఱ అనుచున్నారు. శిష్టోచ్చారితత్వమే యని మఱికొందఱ అనుచున్నారు. వ్రాయఁబడనివ్యాకరణమని మఱికొందఱ అనుచున్నారు. ఒకనిమాట మఱియొకనికి నచ్చదు. ఉన్నవారందఱుఁగూడఁ దొమ్మండ్రు కాఁబోలు. నియమమువంటివస్తు వున్నదా? ప్రపంచతంత్రమున కదియే ప్రధానము. భాషాతంత్రమునకు వ్యాకరణమే ప్రధానము. దానికి లోపము గలిగినపిమ్మట నట్టియసందర్భములకు లోప మేమి?

అట్టియసందర్భములకు లోనయినదే మామిత్రులపద్య చతుష్టయము. భాష గ్రాంథికము. పద్యరచన ఛందశ్శూన్యము. ఒడలఁ గట్టినది మడిబట్ట! నోటఁబెట్టినది పొగచుట్ట! పితృదేవతలకు యథావిధిగఁ దర్పణ మీయఁగలఁచినవారు జన్నిదములఁ దీసివైతురా? జన్నిదము లెట్లో ధరించినను బ్రహ్మముల్లు పనికిరావని వాని గత్తిరింపఁ దగునా?

మామిత్రు లీపద్యరచనయందు యతిప్రాసాదినియమము ను బాటింప లేను. పాటింపలే దనుటకును వీలు కనఁబడదు. పాటించి రనుటకును ధైర్యము తాళదు. కొన్నిపద్యములలోఁ బ్రాసములు వైచినారు. కొన్నిపద్యములలోఁ దప్పప్రాసములు వైచినారు. ఒకపద్యములో వేయలేదు. కొన్నిటిలో యతులను

వైచినారు. కొన్నిటిలోఁ దప్పయతులు వైచినారు. కొన్ని పద్యములలోఁ బూర్ణముగ మానివైచినారు. ఒకపద్యములో గణనియమమును గూడ నిరాకరించినారు. మానఁ దలఁచిన వారు మానవచ్చును. వేయఁదలఁచినవారు వేయవచ్చును. మానుట వైచుటకూడ నెందులకు? ఒకదినమున నిండుదుస్తులతో వీథులలోఁ దిరిగి రెండవదినమున శిరోవేష్టమును దీసివైచి కట్టుబట్టలతో మాత్రమే తిరిగి మూఁడవదినమునఁ గట్టుబట్ట నూడ్చి శిరోవేష్టముతో మాత్రమే తిరిగి, నాల్గవదినమున దిగంబరుఁడై మోకాళ్లమీఁద దేఁకుట నరునకు హాస్యస్థానము కాదా?

దీనిలోఁ గూడ మామిత్రు లాంగ్లేయకవితాపద్ధతినే యాదర్శముగ గ్రహించియుందురా? Iambic Pentametre కల పాదమునకు మొదట Trochee యుండవచ్చు ననియు దానిలోనే యొకప్పుడు పదునొకండవ Syllable (ఏకాచ్కము) Hypermetrical గా నుండవచ్చుననియు నాంగ్లేయకవితా లక్షణము ప్రతిపాదించుచున్నది. ఒక్కటే నడకగలపాదము లనేకములు వ్రాయవలసివచ్చినప్పుడు చెవికి విసుగు గలుగకుండున శ్లోకవులు వింతకై కొంతయట్టినియమమును జేసికొని యుందురు. వారివృత్తసంఖ్య కొలఁదికాని మనవృత్తసంఖ్య యనంతము కాదా? చెవికి విసుగురాకుండ వేలకొలఁది వేఱు వేఱువృత్తములను మనము వ్రాయవచ్చును. వీరు వ్రాసిన

వన్నియు నాల్గుపద్యములు. వానిలో రెం డుత్పలమాలలు; రెండు కందములు. ఈపదునాలుపద్యములే పాఠకుల చెవులకుఁ బాడినదేపాట యన్నట్లు విసుగును గలిగించునని వీ రూహించి యిట్టిమార్పులు చేసియుందురా? రెండుపద్యములైన హృద్యముగ వ్రాయలే నేమోయనునధైర్య మున్నవీరు వ్రాయుట యెందులకు? వ్రాసి యెవరిని సంతోషపెట్టవలయును?

మామిత్రు లాంగ్లేయకవులపద్ధతినిగూడ నవలంబించినట్లు కనఁబడదు. ఛందోనియమములను వీరు తృణప్రాయముగ వర్జించుటకే సాహసించిరి. ఇంతసాహసకృత్యమునకుఁ గారణ మేమైయుండును? యతిప్రాసములు వైచి పద్యములు చెప్పుట కష్టమని వా రూహించిరేమో? అటులైన నీయాపద నేల మీఁదఁబడవైచికొనవలయును? వీరిని నాదర్శముగ గ్రహించి గద్యమును గర్తృకర్మక్రియలతో వ్రాయఁజాలనిమఱియొకఁడు జేపు క్రియ లేకుండ వాక్యరచనను జేయవచ్చునేమో? అట్టి వానికివీరు మార్గదర్శకులై యుండరా? యతిప్రాసము లనావశ్యకనియమము లని మనమిత్రు లెంచి వానిని విసర్జించిరేమో! గద్యముకంటెఁ బద్యము విలక్షణనియమములు గలిగి యుండుప్రారబ్ధ మొక మనభాషలోనేనా? చేతవాతఁగాని పూర్వకవు లన్నిభాషలలో నీబాధలు పడుచు బ్రదుకులు తెల్లవార్చుకొనలేదా? ఆనియమము లావశ్యకములని వా రెంచుట చేతనే యట్లు చేసియుందురు కాదా? సృష్ట్యాదినుండి యిప్పటి

వఱ కున్నయందఱ కానియమము లావశ్యకము లైన మన మిత్రుల కొక్కర కనావశ్యకము లయ్యెనా? పద్యములు కొంచెము హెచ్చుతగ్గుగఁ బాటలవంటివి. పాటలను శ్రుతిలయ విహీనముగఁ బాడవచ్చునా? పాడిన నవి పాట లనిపించుకొనునా? అటులే ఛందోనియమశూన్యము లగుపద్యములను వ్రాయవచ్చునా? వ్రాసిన నవి పద్యము లగునా? మామిత్రు లిందుల కేల సాహసించిరో బోధపడదు.

కావున మామిత్రు లీనియమముల నిరుపయోగములని యెంచిన నెంచుట తప్ప వేఱుగ నెంచుట కవకాశ మేమియు లేదు. వీరియభిప్రాయ మదియే యైయుండును గాని యీ గ్రంథములో నైదవపుటలో “ఛందస్సులు, వృత్తనియమములు గతులు, పిచ్చినిర్బంధములు కావు. రస ప్రదీపనమునకు సాధనములు” అని వీరు వ్రాసినారు. ఏమి యీవిరుద్ధము! ఏమియీ యసందర్భము! పిచ్చినిర్బంధములు కానియెడలఁ దా నేల వదలుకొనవలయును? ఈనిర్బంధములు మనకు, స్వేచ్ఛ తనకు నా? ఈనిర్బంధముల వదలుకొనినతా నేనోటితో నీమాటలను బలుకఁగలిగెనో తెలియఁజాలకున్నాము. శిష్యులకేనా బ్రహ్మచర్యవ్రతము! మామిత్రు లూరక బోధించువారే కాని యట్లాచరించువారు కారా? అట్లైచో “పండితులబోధలకూ నడతలకూ యెట్లుసమన్వయము లేదో” యని వీరు పండితుల నేల యధిక్షేపించినారు? వీరు చేసినయీబోధమునకుఁ, జూపినయీ

నడతకు, సమన్వయ మెట్లు చెప్పఁగలరో? నేను బండితుఁడను గానని తప్పకొనఁదలఁచి రేమో? తాతాచార్యులగారిముద్రి బుజముతప్పినను వీఁపు తప్పునా? ఆంధ్రమునఁ గాకపోయిన నాంగ్లేయముననైన వీరు పండితులు కారా? అదిగాక యాంధ్రమునమాత్రము వీరు పండితు లనునమ్మకము వీరికి లేదా? అట్లే లేనియెడల "ఈవ్యాసములు మనకాలేజీలలో విద్యార్థులకున్ను ఆంధ్రసాహిత్యముతో పరిచయము గలతదిత రులకున్నూ ఉపయోగించేనిమిత్తము వ్రాసినాను" అని వీరు గ్రంథాదియందే ఫలశ్రుతిని వ్రాయనేల? విద్యార్థులకుబోధించు వారు పండితులుగాక మ ఱెవ్వరు? సాహితీమంతుల కుప యోగించునట్లు వ్రాయఁగలవారు సాహిత్యవంతులుకాక మ ఱెవ్వరు? కావున వీరు పండితు లనియే వీరినిశ్చయము. కామని యిప్పుడు తప్పించుకొన వీలులేదు. పండితు లగుటచే నందఱ పండితులకుఁ గలిగినదనివారు చెప్పినయసందర్భము వీరికిఁగూడ గలిగినది.

ఈపద్యములు మొత్తముమీఁద నేమియు బాగుగ నున్నవికావు. శబ్దములు హృద్యములుగ లేవు. అభిప్రాయము లుదారములుగ లేవు. 'సరసత నీరసత' చూప రచింతునని వీరు వ్రాసిరే కాని 'నీరసత' నేదో చూపుటకై మాత్రమే వ్రాసినట్లు కనఁబడుచున్నది. ఛందస్సు నప్పుడు నేర్చుకొను చున్నయెడాఅుతరగతులలోనిమా 'కాలేజి' బాలుఁడు వ్రాసిన

ట్లయిన వీరు వ్రాయలేకపోయిరి. అందుచేత వీరు కవితాధార కలవాడుకారని చెప్పవలసివచ్చినది. అట్టివీరు కవిత్వమున కెన్నఁడుఁ బ్రయత్నింపఁ దగదు. “కవిత తెచ్చిపెట్టుకొందా మంటే వచ్చేది కాదు. తనంతట తానే పుట్టుకొని వస్తుంది” అని వీరు యేడవపుటలో పరమార్థమునే సెలవిచ్చినారు. కాని కొంత దానిని బలాత్కరింపవలయునని కాఁబోలు నీరీతిగాఁ గక్కుఱితిపడినారు. తిరుగ నెనిమిదవపుటలో “ఉత్సాహము ఉప్పొంగి కావ్యము చెప్పినప్పుడు చూచి ఆనందించేవారు కలరా? లేరా? అనే ప్రశ్న కలగనే కలగదు.———— విషాదముచేతనో, చెప్పలేనియానందముచేతనో తెలివితప్పి కవి తననేర్పుకొద్దీ వెఱ్ఱిమొఱ్ఱికూతలు పెడతాడు.” అని తేనె పెరవంటివాక్యము నొకదానిని మామిత్రులు వ్రాసినారు. కాని ప్రస్తుతమునఁ బరమార్థ మాలోచింపఁగ నశక్తిచే నప్రయోజకతచేఁ గవి వెఱ్ఱిమొఱ్ఱిగ వ్రాయవలయునుగాని యత్యానందముచే వెఱ్ఱిమొఱ్ఱికూఁతలఁ బెట్టఁడని తోఁచు చున్నది. “కవివిషయమై కావ్యము తెలుపగలమొదటి అంశము అతనిబుద్ధిప్రభావము, అతనిపాండిత్యము.” అని వేద వాక్యమువంటివాక్యము నొకదానిని మామిత్రులు 17 వ పుట లో వ్రాసినారు. తన్నుఁగూర్చికూడఁ దా నీవాక్యములో వారు చెప్పుకొనియే యున్నారు కావున మేము వేఱుగఁ జెప్పము. విమర్శనముతో మేము విసుగుఁజెంది యున్నాము.

ఎంతసేపును దప్పులఁ జూపించుటతోడనే సరిపోవుచున్నది. మెప్పున కర్హమగునొప్పు కనఁబడునేమో దాని నాత్రముతో గ్రహించి మామిత్రుల నొక్కసారి నోరార స్తుతింతమని మే మెంచితిమి కాని మా కాయానందము లేదు. వారి కట్టి యదృష్టము లేదు.

నిజముగా మామిత్రులతో మా కేమియుఁ దగవు లేదు. వారియెడల గౌరవము కలవారము. ఆంధ్రుల కాంధ్ర భాషయం దధికాదరము లేనియీకాలములో మామిత్రులాంధ్ర మందుఁ గొంతపరిశ్రమ మొనర్చినందులకు సంతసించుచున్నాము. అందులో నాంగ్లేయభాషలో మహోన్నతపరీక్షలోఁ గృతార్థతఁ బొందుటకుఁ దగినవిశేషశ్రమ మొనర్చుచుఁగూడ నాంధ్ర భాషలో నీమాత్రమైన 'పరిచితి' ని సంపాదించుకొనినందులకు వీరి నెంతయైనఁ గొనియాడుచున్నాము. అంతటితో నూర కుండక తమకుఁ దెలిసినయాంగ్లగ్రంథములలోని యమూల్యాభి ప్రాయములను దేశీయసోదరులకు బోధింపనెంచి గ్రంథరచన చేయుచున్నందులకు వీరి నర్హముగ స్తుతించుటకే మేము శక్తి గలవారము కాము. బుద్ధి మంచిది. అభిప్రాయము మంచిది. ప్రయత్నము మంచిది. కాని గంధపుగిన్నెలో కస్తూరియత్తరువు నకు బదులుగా 'కిరసనాయిలు' పడినది. గ్రామ్యభాషలో దీనిని వ్రాయుపట్టుదలయే యీగ్రంథమున కింతయనర్థము తెచ్చినది. గ్రాంథికభాషలోనే యీగ్రంథమును వీరు వ్రాసి

యుండినయెడల నిన్నితప్పులు వ్రాయఁజాలియుండరు. ఇన్ని యసందర్భములకు లోనై యుండరు. గ్రామ్యభాష ననుసరించుటచేతనే, దానికొఱకేకూడ మామిత్రు లిన్నిదోషములను వ్రాసినారు.

వీరిగ్రామ్యపక్షత్వమునకై మే మెంతయైన విచారించుచున్నాము; విచారింపఁ దగదా? వీరు చిన్నవారు. బుద్ధిమంతులు. ఆంగ్లేయభాషాజ్ఞానము కలవారు. దేశీయులయజ్ఞానమును బోఁగొట్టవలయు ననుసదుద్దేశము కలవారు. అట్టివీరు, అట్టిమామిత్రులు "మనిషినిబట్టిన్నీ విషయమునుబట్టిన్నీ, మారుసట్టిన్నీ సంభాషణభాష కాకపోయినా, దానికి దగ్గరగా ఉన్నట్టిన్నీ గ్రాంధికశబ్దము లొకప్పుడు విశేషముగా దూరి గ్రాంధికభాషలా ఉన్నట్టిన్నీ, మరొకప్పుడు సంభాషణభాషలా ఉన్నట్టిన్నీ ముండా ముత్తయిదువా కానట్టిన్నీ" రా. సా. గి. రా. పంతులుగారు చెప్పియుఁ జెప్పఁజాలనట్టిన్నీ, జెట్టికంటె నెక్కువకాళ్లున్నట్టిన్నీ శేషునికంటె నెక్కువనోళ్లున్నట్టిన్నీ యెవ్వరుఁగూడ జెప్పుటకు శక్తిచాలనట్టిన్నీ, చెప్పఁదగినది కానట్టిన్నీ యసాధ్యానిర్వాచ్యస్వరూపముగల వ్యావహారికభాషలో నీగ్రంథమును వ్రాసి శ్రమమంతయు నిష్ఫలము చేసికొనుటయే గాక గ్రంథము హాస్యాస్పదముగఁగూడఁ జేసికొనినందులకై మే మెంత చింతించుచున్నామో మామనస్సులకే యెఱుక! ఈపనికిమాలిన

ప్రయత్నము నింతటినుండి వీరు వదలుకొని, ప్రపంచజ్ఞానము నింకను సంపాదించుకొని, కొన్నిసంవత్సరములు దాఁటినపిమ్మట గ్రాంథికభాషలోనే గద్యగ్రంథముల వ్రాయఁగోరుచున్నాము. భావములు, కల్పనము లెటున్నను భాషయైన బాగుగనుండును అదికూడ నాలుమూఁడైనయెడల నాంధ్రులు మఱింతవిచారింపరా? ఆంధ్రులజోలికూడ మామిత్రుల కక్కఱలేదు. ఏగ్రాంథికభాషలో 'గాదిలిపట్టి' యైన వీరి కభిమానము పాండిత్యము గలుగఁజేయుటకై వీరిచిన్నతనమునుండి తండ్రిగారంతగాఁ దాపత్రయపడిరో యాభాషనే వీరు వర్జించుట తండ్రిగారి కెంతసంతాపకరముగ నుండునో? తండ్రిగారికిచ్చిన కృతి తండ్రిగారినైన సంతోషపెట్టవలదా?

సాధకబాధకములను దూరమాలోచించుకొని గ్రామ్యవాదమును వీరు త్యజింపవలయును. వ్యావహారికభాషగ్రాంథికభాషకంటె సర్వాంధ్రజనసుగ్రహ మనుట వెఱ్ఱియూహము. మానమూఁడవ రెండవకరపత్రములోనియనుబంధము చూచినయెడల మామాట వాస్తవమో కాదో చదువరులకుఁ దెలియును. మఱికొన్ని నిజామురాష్ట్రపుటుత్తమజాతివ్యావహారికాంధ్రభాషాపదములును రెండుత్తరములును సంపాదించి దీనికనుబంధములుగాఁ జేర్చితిమి. సంశయము లేమైన మిగిలియున్నవని వానివలన నిశ్శేషముగఁ దీఱునని మాదృఢాభిప్రాయము.

గ్రా[illegible]ప్రవాదమును నిరసించుకోరిక చేతనే మామిత్రుల లోపముల నన్నిటిని వెల్లడింపవలసివచ్చినది. ఇందులకు మమ్ము మామిత్రులు క్షమియింతురుగాక !

ఇది రెండవభాగము.

సమాప్తము.



# అనుబంధము I.

## హైదరాబాదు రాష్ట్ర వ్యావహారికాంధ్ర పదపట్టిక.

| పదములు. | గోదావరిజిల్లా వ్యావహారికభాషలో వానియర్థములు. |
|---|---|

1. వతను=రాబడి.
2. సాలె=బరి.
3. కూకుంటావ్=కూచుంటావు.
4. సాలె=భావమరిది.
5. గోరం=చిత్రం.
6. బూరు=ఎక్కువబొచ్చు.
7. ఆన=వాన.
8. నాత్రి=రాత్త్రి.
9. వొయ్యి=పొస్తకం.
10. వగ్నింపుట=గర్భాదానం.
11. తోలుకొచ్చుట=తీసుకొచ్చుట.
12. లొల్లి=అల్లరి.
13. ఎల్లుట=వెళ్లుట.
14. ఇయాల=ఈరోజు.
15. గిట్రా=ఇలారా.
16. గిట్ల=ఇలా.
17. బేకిండు=కొట్టాడు.
18. ముల్కు=దేశం.
19. నీభాంచోణ్ని=నీనౌఖర్ని.
20. నీకాల్మొక్త=నీపాదాలు పడతాను.
21. తోడెము=కొద్దిగ.
22. ఇన్రి=విన్నారు.
23. ఇగో=ఇదుగో.
24. అన్నాలం=అన్యాయం.
25. కర్రగనున్నడు=చిక్కాడు.
26. గట్ల=అలా.
27. బాపనయ్యా, బామనయ్య, బాఁవండు =బ్రాహ్మడు.
28. యాడికి=యెక్కడికి.
29. గాడికి=అక్కడికి.
30. సీకటి=చీకటి.
31. పోస్తది=పోస్తుంది.
32 ననుగు=ప్రతి.

33. అగ్గువ=చవక.

34. పుక్కటికి } =ఊరికే.
ఊకె

35. దాంట్లె=అందులో.

36. గొల్లపోల్ల=గొల్లాళ్లపిల్ల.

37. సెను=ఉండు.

38. పొద్దుమూకుట=పొద్దుకూకుట.

39. యిస్తార్లు=విస్తరంటలు.

40. గుద్దపట్టిండు=గుద్దడమొదలెట్టాడు.

41 దుకునం=దుకాణం.

42 చూయించు=చూపించు.

43 అప్పయ్య=పినతండ్రి.

44 చిన్ని=పినతల్లి.

45 తనఖా=జీతం.

46 దువ్వం=రెండోతరగతి.

47 సువ్వం=మూడోతరగతి.

48 టొంభై యారు=తొంభైయారు.

49 కూంబచు=కూచో.

50 దవాఖానా=ఆస్పత్రి.

51 బరుసుబరుసు=మోట.

52 ఎంటికలు=వెంట్రుకలు.

53 తలంటారం=తలంటు.

54 ఆస్తే=నెమ్మదిగా.

55 ఆకు=పేజీ.

56 ఎన్కాల=వెనకభాగాన్ని.

57 కొంచబోతా } =తీసుకుపో
కొంటబో

58 కొట్టేశిండు=తీసుకున్నాడు

59 అండ్ల=అందులో.

60 మంచోడు=మంచివాడు.

61 అడిగిండు=అడిగాడు.

62 బగోని=గిన్నె.

63 దేకీచ } డేకిసా.
కొప్పెర

64 మీవోండ్లు=మీవాళ్లు.

65 తీస్కపోయినంక=తీసుకుపోయాక

66 గుడ్డోడు=గుడ్డాడు.

67 తెల్లారినంక=తెల్లవారాక.

68 —ంకిపోయిండు=పారిపోయాడు.

69 అయిందిగని=అయిందికాని.

70 పిల్సిండ్రు=పిల్చారు.

71 రాంగనే=రాగానే.
72 బోయ్యారము=కన్నం.
73 ఏంజేసిందికద=ఏంజేశిం
74 పెయ్యా=వాళ్లు. [దంటే
75 ఈ=ఊఁ.
76 ఆడివాండ్లు=ఆడాళ్లు.
77 ఎల్లిండు=వెళ్లాడు.
78 ధప్పా=నెత్తిమొత్తన్ను.
79 లాతు=తన్ను.
80 తోవ్లా=తోవలో.
81 అవాక్కోరి=గాలిపిల్చడం
82 ఇగేంగదంటె=ఇంకేఁమి
83 అరాజ్=వేలాం. [టంటే.
84 ధా
తాన } దగ్గర.
85 పురోతుడు=పురోహితుడు.
86 సాల్=సంవత్సరం.
87 రోఖాయించకు=అడ్డంరాకు.
88 ధాతి=సిరాబుడ్డి.
89 కాయిదం=కాగితం.
90 అగో=అదుగో.
91 జైరది=గొప్పది.
92 నాసిది=తక్కువది.
93 ఆసంగ=ఆవేపు.
94 ఈసంగ=ఈవేపు
95 ఎందులకెల్లి=ఎక్కణ్ణుంచి.
96 సంగాగాడు=తక్కువ్వాడు.
97 మోఖళా=పెద్దసంతర్పణ.
98 దొడ్డు, దొబ్బ=లావు.
99 తుళ్ళి=గజ్జలపట్టెడ.
100 గవాయి=సాక్ష్యం.
101 పొద్దులు=పురిట్రోజులు.
102 సరువ=పాత్ర.
103 గెంటీలు=స్త్రీలుచెవలకు [పెట్టుకొనేసగ.
104 క్యాదకి=మొగల్ రేకు.
105 కిశ్తి=ఇనప్పళ్లెం.
106 కచ్చడం=బండి.
107 తేజుగావుంది=ఎక్కువగా [వుంది.
108 ఇసురాయి=తిరగలి.
109 మిసిరి
నగుబోతు } పటికిపంచదార
110 పయ్యా=బండిచక్రం.
111 చితలప్పండు=శీతాఫల [ప్పండు.

112 యిలాచీలు }
ఇలాచీలు } =ఏలకులు.

113 అంబట్లతుట్ట=రెండు పక్క- [లవాళ్లూ.

114 అందంక=అందాక.

115 అంళ=అందులో.

116 అత్తరబుత్తర=తొందరగా

117 అమ్మాత్రయి }
పెద్దాయి } =పెత్తల్లి.

118 అన్నయ్య }
కాక } =తండ్రి.

119 అన్నగాడు=పెద్దాడు.

120 అల్లాయిపుల్లాయి=కౌగలిం [చుకోవడం.

121 అప్పటికి=తర్వాత.

122 అనుకోజిక్కి=అనుకొన్నె [మో.

123 అరుచుకో=కనుక్కో.

124 అయ్యార్లు }
అయ్యోర్లు } =వైష్ణవులు.

125 అలుకుట=విత్తనాలుపోయ [డం.

126 అశ్వ }
అశ్వ }
కలప } =మంగలిపోది.

127 ఆనంగ=అట్నించి.

128 ఆతోవపొంటిఉరుకు=ఆ [తోవనుపారిపో.

129 ఆరిశలుజోడు=సులోచనా [ల్జోడు.

130 ఆయెల్లి=నిన్న.

131 ఆయిన్ని=అవన్ని.

132 ఆయింత=అదంత.

133 ఆలుగడ్డ=బంగాళాదుంప.

134 ఈనంగ=ఇట్నించి.

135 ఇడుగుపెట్టుట=మాగాణి భూమిని మొదటిసారి దు న్నడం.

136 ఇక్కెర=హారికర్పూరం.

137 ఇలపీట=కత్తిపీట.

138 ఉద్దెర=అరువుతేవడం.

139 ఏమిలె=వొప్పుకొనడం.

140 ఎకానా=లాభం.

141 ఎక్కా=గోడలాంపు.

142 ఒండింపుట
వొండింపుట
వొడినింపుట } =గర్భాదానం చేయడం.
143 కంగు=పాలమీదమీగడ.
144 కంక పెనాలు=వెదుళ్లబీడు
145 కంచుడు=మూకుడు.
146 కండ్లొచ్చినై=కళ్లుకలగడం
147 కంకగుల్ల
పాలగుల్ల } =వెదురుపేళ్ల బుట్ట.
148 కంచె=బీడు.
149 కడిలయినరు=వెళ్లిపోయా[రు.
150 కమ్మలయిల్లు=తాటాకిల్లు
151 కణతలుతీయుట=ఊరేగిం[చుట.
152 కళ్లేపుగిన్నె=నోకర్ణం.
153 కట్లవిత్తులు=కుంకుడు కా[యల్లాటిగింజలు.
154 కరడాలుదిద్దుట=కాపీవార[వడి పెట్టడం.
155 కడపపీట=బండిలోబండి[వాడుకూచునేచోటు.
156 కళాబందిమేళము=బోగ[మేళము.
157 కిస్నాబడ్డది=తగాయిదా[వొచ్చింది.
158 కుట్లకెల్లతినుట=గొంతుక[దాకాతినడం.
159 కొరకాసు=కొరకంచు.
160 గర్జులేదు=అవసరన్లేదు.
161 గడుగా=పంచిపాత్రి.
162 గడ్డినూనె=కిర్సనాయల్[నూనె.
163 గత్ర=కలశా.
164 గట్టిపిండి=నలుగుపిండి.
165 గది=అది
166 గప్పుడు=అప్పుడు.
167 గాజులు=నూతివొరలు.
168 గాడెము=ఏతాం.
169 గామాట=ఆమాట.
170 గిజగిజఉరుకుట
గిద్దగిద్దఉరుకుట } గబగబ పరుగె[త్తడం.
171 గిట్లలు=బండిచక్రం.
172 గిరివి=తాకట్టు.

173 గుడ్డ బట్టలు=కట్టు బట్టలు.
174 గుడాలు=గుగ్గిళ్లు.
175 గై=వెదురుగడ.
176 గైరి=మంచిది.
177 గొట్టు=గట్టిది.
178 గోదలు=ఎడ్లు.
179 చిక్కుడుకాయలు పెట్టుట=కితకితలెట్టుట.
180 చిమ్మెడు నస్యము=ఒకపట్టు పొడుం.
181 చిక్కసం=ముగ్గుపిండి,
182 చేపోయి=బదులేవడం.
183 చేరేళ్లు=ద్వారబంధాలు.
184 చైసు=నిదానించడం.
185 చాల్ జెయ్యి=చాలించు.
186 చక్కిలం, ముక్కిలం=మరంవేయువిధం.
187 చుక్క=పావలా.
188 జీబిలిపుల్ల=గులివి తెడ్డు.
189 జూకుట=తూచడం.
190 జల్లిబోయింది=రవంత లోతప్పిపోయింది.
191 జింగిపోయింది=ఆగిపోయింది.
192 తొంగులుబొడుచుట=మొట్టడం.
193 తంతెలు=మేడమెట్లు.
194 తాయపెంకు=ఇనపసిబ్బి.
195 తింపు=తిప్పు.
196 తీటకోయిల=దూలగుండ.
197 లంటుకులంటు ఉన్నదు తుంటకుతుంట ఉన్నదు = చాలా లావుగా వున్నాడు.
198 తుట్టపోయినాడు=దండుగపోయాడు.
199 తుట్టబడాయించింది=పొగరెక్కింది.
200 తొడచిమ్ముట=తొడపాశం పెట్టడం.
201 తొడుక్కోపోవుట=పిలుచుకుపోవడం.
202 దంబెడ=పెద్దమాను.
203 దప్పాలు=దెబ్బలు.
204 దస్తీగుడ్డ=చేతిరుమాలు.

205 తెంకులాడుట = వెతక
దేవులాడుట ..డం.
నెంకులాడుట

206 దేహాతిపని = స్వదేశప్పని.

207 దొంతికూర్చున్నడు = గొం
[తుకూర్చున్నాడు.

208 నంగాగాడు = చాలాబీద
[వాడు.

209 నక్క = దొంగవాడే శే

210 పితుకు = ముక్క. [కన్నం

211 నాలుగక్కల్లనించి = నాలు
[గువేపుల్నుంచి.

212 నిస్వా = సహాం.

213 పందార = చక్కెపంచదార.

214 పండ్లపొడి = దాశిన్చెక్క.

215 పత్తులు = పాళీలు.

216 పన్నావా = పడుకొన్నావా.

217 పడిపోయినది = దిగబడింది.

218 పడగొట్టిరా = పంపించిరా.

219 పాలబిందె = నల్లికిళ్లపాము.

220 పిట్లా = ఉప్పుడుపిండి.

221 పిన్నాడు = పిల్లాడు.

222 పిస్సవాడు = పిచ్చివాడు.

223 పుంటికూర = గోంగూర.

224 పుల్లగండోడు = పోకిరి.

225 బంగుబాయి = తూగుటు
[య్యాల.

226 బడేఉన్నవు = మహావున్నా
[వు.

227 బరిబాతల = దిగంబరిగా.

228 బేడెము = తలుపుగడియ.

229 బేగిరా = చప్పునా)

230 బేవులు = తేనుపులు.

231 బొంగబోవుట = చెరువుగ
ట్టుకు బెజ్జంపడినీరుకారడ

232 బొక్కలు = ఎముకలు

233 మందిబీడుగాఉన్నరు = జ
సమ్మర్దంఎక్కువగావుంది.

234 మన్నెపువాడు = మాలాడు

235 మాణిక్యాలు = దీపప్రమిద
[లు.

236 మిత్తి = వడ్డీ.

237 మూలగొట్టుమాట = మా
[ర్మాలపదం.

238 మొక్కపొట్లు = మొక్క
[జొన్నపొత్తులు.

239 యసల = పిడత.

240 యాష్టవచ్చింది=విసుగే
[శింది.
241 యాది=జ్ఞాపకం.
242 లండోడు=పనికిమాలిన
[వాడు.
243 ఉలాసిగాకొట్టరా=ఈడ్చి
[కొట్టరా.
244 వట్టలుబడగొట్టుట=దద్దుర్లు
[పడేటట్లుకొట్టడం.
245 వయి=పొస్తకం.
246 వల్లు=శఘునంగాలేదు.
247 వుసుక } =యిసక.
వుస్క }
248 వాంటించుట=కుదర్చడం.
249 వాడిసిపోయినవి=అయి
[పోయినవి.
250 వార్లుట=గట్టిగాఅర్వడం.
251 వోడించుకొనిరా=భోజ
[నానికొస్తాననిపించుకురా.
252 శాస=పారాయిణి.
253 [illegible]=పంపన
[పనాసకాయ.
254 సాలెం=అన్నీ.

255 సాతచేయించుట=గుడ్డలు
[చలవచేయించడం.
256 సానుపుచల్లుట=కళ్లాపుచ
[ల్లడం.
257 సర్ది=రొంప.
258 సుర్మాకలం=పెనసలు.
259 సైతం=మెత్తనిగోధుంపిండి
260 పేండ=పేడ.
261 పెద్దమనిషి=ముసలాడు.
262 పొంటేలు=ఝూములు.
263 పొడావు=పొడుగు.
264 పొడగొట్టు=పోగొట్టడం.
265 పొప్పడికాయ=బొప్పాయి
[కాయ.
266 పోచమ్మ=మశూచికం.
267 పల్లీలు=వేరుశనగపప్పు.
268 బాసండ్లు=వంటగిన్నెలు.
269 గోలుగా=గుండ్రంగా.
270 ఉనక=ఊక.
271 ఎంపుల్లో=ఏమిరోయి.
272 కైకిలి=కూలి.
273 కీసాలు=చొక్కాజేబులు.
274 వాయి=ఓయి.

గుత్తి తెలుఁగు.

యెఱ్ఱమసి=యెఱ్ఱసిరా. పేనా=కలం. చుట్టం=వుంచుకున్నది. అన్నప్పాడి=కందిపొడుం.

గంజాము తెలుగు.

రెట్టకాయలు=కుంకుడుకాయలు.

# అనుబంధము II.

## ఉత్తరములు.

మరాసిలాఅజ్ క బెహారి తహసీల్ తాలూకా శిరిశాల జిలె యెల్ గందర్ వాక్కె బ 3 పర్వర్ది స్న ౧౩౦౯ సాలు నిషా౯ ౩౨౪.

బి. నరసింహారావు వుమీద్ వార్ తహసీల్ హజాకు తెలియపర్చనవుతుందికదా ఆలీజనాబ్ అవ్వల్ తాలూకాదార్ సాహేబ్ జిలె ఎల్ గందల్ గారు బిల్ ముషాఫాయలాటిహుకుం యిచ్చిఉన్నారుకదా. నీకు మోజె నల్లగొండవకొ రెపట్వారిగిరి పైన మాములచేయగలందులకు—

కావున హుకుం యివ్వనవుతాంది కదా నీవు మొవాజాత్ మజ్కూర్ కు నేడే హాజరయ్యి దఫ్తర్ పట్వార్ గిరిజాయి జాహాసిల్ జేసుకొని ప్రితిదివసం మహాజాత్ మజ్కూర్ లో హాజరుండి సర్కార్ పని బహుజాగ్రత్తగా అదా చేస్తూవుండావలసింది. లాకె ఇందుల్ ఖులూఎజాయిదాద్ సర్కార్ ఖిద్మతు

పైన ముస్తఖలానా మామూరు చేయగలందులకు పేహాజ్ చేయడం కాగలదు.

(౧) ఇందువలన ముసన్నసాబక్ పట్వారి కిచ్చి వ్రాయిం చేది యేమనగా నవుదఫ్తర్ పట్వార్ గిరిజాయిజానరసింహారావు కిచ్చి నీవు అలగ్ కావలసింది.

(౨) ముసన్నసానిదఫ్తర్ నగదీకి బగర్ జెయిూసాబోంయి స్కీ యివ్వడమైంది. ఫక్తు.

అర్థము. (గ్రాంథికభాషలో)

ఎల్ గండల్ జిల్లా శిరిశాల తాలూకా తహసీల్ కచ్చేరీనుండి

తేది 2 వసర్వర్ది 1306 సం॥

నెం 374

ఉద్యోగార్థి యగు బ్రాహ్మణ నరసింహరావుగారికి తెలియపఱచున దేమనఁగా

నిన్ను నల్లకొండ, కోరెమనుగ్రామములపైని కరణము గా నియమించినామని

కావున నిప్పుడాజ్ఞయిచ్చునదేమనఁగా నీ వాగ్రామాదులకు నేఁడే వెళ్ళి కరణపులెక్కలకాగితములను స్వాధీనము చేసి కొని ప్రతిదినమును ఆగ్రామాదులలో నెల్లప్పుడు నివసించుచు దొరతనము వారిపనిని జాగ్రత్తతో నెఱవేర్చుచుండవలసినది. దీనికి ప్రతిఫల మేమనఁగా దొరతనము వారియుద్యోగస్థానములలో నేదయినను ఖాళీయుండినయెడల నప్పటిమాచిత్తము

ననుసరించి దానికి నిన్ను నుద్యోగిగాఁ జేయఁగలము. ఇందులకు పత్రిక. ఇదివఱ కుండిన కరణమునకు వ్రాయించి యిచ్చిన దేమ నఁగా నీవు కరణపులెక్కలకాగితములను నరసింహారావున కిచ్చి నీవు తొలఁగవలసినది.

ఇంకొక ప్రతి-కోశాధ్యక్షునికి చేతన మిప్పించుటకై యాజ్ఞ యీయఁబడినది.

ముగిసినది.

---

బెంగుళూరు 8–5–14.

చిం సుబ్బయ్యకి తాళంకి-చిన్న నరసింహ్మ శెట్టి చేశే ఆశీర్వాదం.

మీకి 2–3 కార్డులు వ్రాయించిన జవాబులేదు. యేమి కారణం తెలియలేదు. నేను నింన్ను కన్యాకవుంచి చూచేకి రమ్మని రాస్తిని. యిదివర్కు రానిదాన్కు రాశేది. వారు యింకా వ్యారేచూడవలనని వుంన్నారు. దాను వల్లారాయించి నాను. మాపుట్టయ్యయింట్కి-పోటువంటమనిషివచ్చెనా అడగి కొనివచ్చేది. బాకిలిబారం మీజాబు చూచి రాస్తాను. యిచ్చట అవ్వయ్య క్షేమముగా వుంన్నది. అయితే యీదేవనికి పూజ చేసివుంట్కొ అవ్వయ్య దొరకను. ఆయంమ్మ తప్పు రామనా తప్పుగా వుంన్నది.

అర్థము. (గ్రాంథికభాషలో)

8—5—14.

చి॥ సుబ్బయ్యకు తాళంకి చిన్ననరసింహముశెట్టి చేయునాశీ ర్వాదము.

మీకు 2—3 కార్డులు వ్రాయించినను బ్రత్యుత్తర మీయలేదు. ఏమికారణమో తెలియదు. నేను 1 కన్యకను జూచియుంచి నిన్నుఁ జూచుటకు రమ్మని వ్రాసితిని. ఇంతవఱకు రాకపోవుటకుఁ గారణ మేమో వ్రాయునది. వారు మఱొక సంబంధమును జూడవలయునని యున్నారు. కాన వ్రాయించి నాను. మాపుట్టయ్య యింటికి వంటవాఁడువచ్చెనా? తెలిసికొని రావలయును. తక్కినసంగతులు మీయుత్తరము చూచి వ్రాసె దను. ఇచ్చట అవ్వగారు క్షేమముగా నున్నారు.ఇట్టియవ్వగారు లభించుటకు నే నేదేవుని బూజించియుంటినో? రామరామ ఆమెత ప్పేమియు లేదు. అంతయు నాతప్పే.